కృష్ణశాస్త్రి గేయసంహిత - 1

# అమృత వీణ

www.vaaradhionline.com

రాజహంస  ప్రచురణలు

9, జగదాంబాళ్ స్ట్రీట్, మద్రాసు - 600 017

AMRITA VEENA
(A collection of devotional and lyrical songs)
by Devulapalli Venkata Krishna Sastri

© D. S. Sastri (Bujjai)

*First Edition* ·
**February 1982**

*Published by*
**RAJAHAMSA PRACHURANALU,**
**9, Jagadambal Street, Madras - 17.**

*Printed at*
STREE SEVA MANDIR PRESS
MADRAS - 17

*Cover Design:*
BUJJAI

*Cover Printing.*
VIKRANTH SCREENS

*Price:*
Rs. 20-00

ఈ సంపుటాల లోని గేయాలపై అన్ని హక్కులూ ప్రచురణకర్తవి. వీటి లోని పాటలను గాని, పాటల్లో భాగాలను గాని సినిమా, టెలివిజన్ వంటి ప్రసార సాధనాల్లో అనుమతి లేకుండా ఉపయోగించడం చట్టరీత్యా నేరం.

www.vaaradhionline.com

# కృతజ్ఞత

ఇంతవరకూ పుస్తక రూపంలో రాని మా నాన్న గారి రచనలు ఈ నాడు ఈ రూపంలో వస్తున్నా యంటే దానికి ముఖ్య కారకులు శ్రీ బాలాంత్రపు నళినీకాంతరావు గారు. సుమారు సంవత్సరన్నర క్రితం నేను వారి సహాయం అడగగానే సంతోషంగా ఈ పని చేపట్టారు. ఆ రోజు లగాయతూ ఈ రోజు వరకూ నిద్రాహారాలు లేకుండా, అక్కడా ఇక్కడా ఉన్న రచనలు చేర్చి, కూర్చి వాటికి ఈ రూపం ఇచ్చారు. వారికి నా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. వారి ఋణం నేను ఎప్పటికీ తీర్చుకోలేను.

వారికి చేదోడు వాదోడుగా ఉంటున్న శ్రీ బొమ్మ కంటి శ్రీనివాసాచార్యులుగారికి కూడా నా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాలకి తొలిపలుకు వ్రాసి ఇచ్చిన శ్రీ శ్రీ గారికి నా కృతజ్ఞ తాభివందనాలు.

ముఖ్యంగా, ఈ పుస్తకాల అచ్చుకు ఆర్థిక సహాయం చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారికి నా కృతజ్ఞతలు.

దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి
(బుజ్జాయి)

"నాకేల ఒక జోలె,
నాలో అమృత వీణ
ఉంచి నను లెమ్మందువా
దేవ
ఊరకే పొమ్మందువా !"

- గీతం 59

www.vaakdhionline.com

# ఆస్వాదానికి ఆహ్వానం

ఇక్షు సముద్రం ఎక్కడుందో నాకు తెలియదు. కాని, ఆపాత మధుర మయిన కృష్ణశాస్త్రి సాహిత్యం సమస్తమూ ఇక్షు రసార్ణవమే. కృష్ణశాస్త్రి పలుకుల్లోని చెరుకు తీపి సాహిత్య రస పిపాసువులకు ఎక్కడో ఉందనుకొనే ఇక్షు సముద్రాన్ని వెదుక్కోవలసిన అగత్యాన్ని తొలగిస్తుంది.

అందుకే పురాణాల్లో పేర్కొన్న ఇక్షు సముద్రం ఎక్కడుంటుందో దాని జాగ్రఫీ జోలికి వెళ్లదలచుకోను నేను. మన యెదుట నిజంగా కృష్ణశాస్త్రి సాహిత్య సమస్తమూ ఉరకలూ పరుగులుగా ఉప్పొంగుతోంది. ఇదే అసలు సిసలయిన చెరుకు రసాల కడలి. 'ఆస్వాదించుదాం రండర్రా !' అని అందర్నీ ఆహ్వానిస్తున్నాను.

ఒకప్పుడు కృష్ణశాస్త్రి కవిత్వం మాత్రమే మాధుర్య 'మా' ధుర్య మనుకున్నాము. ఇప్పుడు మీ చేతిలో ఉన్న పుస్తకాన్ని చూడండి. ఇంకా అచ్చవుతున్న, లేదా అయి సిద్ధంగా ఉన్న సంపుటాల్ని చూడండి. అప్పుడు మాధుర్యం అంటే ఏమిటో మీకే అర్థం అవుతుంది. అప్పుడు వాస్తవంగానే ఒక ఇక్షు సముద్రంలో మీరు ఓలలాడుతారు.

కాని, ఇక్కడో చిన్న విశేషం ఉంది. తినగ తినగ వేము తియ్యనుండు నేమో కాని, అంతా చెరుకు రసమే అయితే మొగం మొత్తేస్తుంది. అందుకే కృష్ణశాస్త్రి చెరుకు సముద్రంలో అక్క డక్కడ మిరియాల పొడి ఉంది. కరక్కాయల కసటుదనం ఉంది. ఇంకా మీరు కోరుకొనే ఎన్నెన్నో మసాలా లున్నాయి.

ఇప్పుడు నా మనస్సు 50 సంవత్సరాల వెనక్కి పోతోంది. 1920 ల ప్రారంభ దినా లవి. ఆ రోజుల్లోనే జమీందారీ కవిత్వాన్ని తోసి రా జని భావకవిత్వం రంగ ప్రవేశం చేసింది 1910 - 20 ల మధ్య ఈ ఉద్యమాన్ని ప్రారంభించిన వారు రాయప్రోలు, అబ్బూరి. అయితే దీనికి 20 లలో అఖిలాంధ్ర ప్రాచుర్యం ఇచ్చినవాడు కృష్ణశాస్త్రి. బరంపురం నుంచి బళ్ళారి దాకా ఈయన తనవీ, ఇతరులవీ భావగీతాల కవితాగానం చేస్తూ యువ తరాన్ని ఆకట్టుకున్నాడు.

అయితే కృష్ణశాస్త్రిది ప్రతిఘటన లేని విజయ యాత్ర కాదు. మహాపండితు డయిన అక్కిరాజు ఉమాకాన్తమ్ "నేటి కాలపు కవిత్వం" అనే పుస్తకం రాసి, అందులో ఎక్కువ భాగం కృష్ణశాస్త్రినే వెక్కిరించాడు. ఉమాకాన్తమ్ (సంస్కృతపు స్పెల్లింగు చూడండి!) గారికి సంస్కృతంలో తప్ప మరెక్కడా కవిత్వం కనబడదు. నన్నయభట్టును కూడా ఆయన కవిగా ఖాతరు చెయ్యలేదు. నేటి కాలం కవిత్వానికి కాలం కా దనేశా డాయన.

కాని, ప్రపంచం మాత్రం వేరు విధంగా భావించింది. భావ కవిత్వాన్ని ఆ నాటి ప్రధాన శాఖగా గుర్తించింది. ఈ శాఖ ఎన్నో కోకిలలకు ఆశ్రయం ఇచ్చింది. (గౌతమీ కోకిలగా పేరు పొందిన వేదుల సత్యనారాయణ శాస్త్రిని ఇక్కడో చిన్న ఉదాహరణగా ఉటంకించ వచ్చును.) ఈ అన్ని కోయిలలలో అగ్రస్థానం సాహిత్య విమర్శకు లంతా కృష్ణశాస్త్రిదే అని అంగీకరించారు.

"నేటి కాలపు కవిత్వం" ఇప్పుడు లైబ్రరీలలో బూజు పట్టిపోతోంది. కృష్ణశాస్త్రి కవిత్వం భావకవితకు పరా కాష్ఠగా నిలబడింది.

అనంతపంతుల రామలింగ స్వామి అనే ఆయన "కృష్ణ పక్షం" కావ్య సంపుటిని వేళాకోళం చేస్తున్నా ననుకుంటూ "శుక్ల పక్షం" అనే రాతని వెలువరించాడు. దాన్ని కూడా ఇప్పుడు చదివే వాళ్ళెవరూ లేరు. ఆ రోజుల్లోనే దాన్ని వేదుల "ఈ శుక్ల పక్షం సారస్య తారిష్టం అనే శుక్ల నష్టం" అని చెప్పి సహృదయుల హృదయ ఫలకాల నుంచి తుడిచిపెట్టి పారేశాడు.

1930 లలో భావకవిత్వం మీద తిరుగు బాటుగా అభ్యుదయ కవిత్వం వచ్చింది. కాలంతో పాటు ఎదుగు తున్న కృష్ణశాస్త్రి అభ్యుదయ కవిత్వాన్ని ఆహ్వానించి ఆశీర్వదించాడు. అంతే కాదు. అభ్యుదయ రచయితల సంఘం వార్షికోత్సవాలలో ఒకదానికి అధ్యక్షత వహించాడు.

సినీమా రంగంలో ప్రవేశించి, మళ్లీ ఇలాంటిది రావడానికి వీల్లేదన్నట్టుగా మల్లీశ్వరి రాశాడు.

ఈ మధ్య కాలంలో ఆయన యెన్నో రేడియో నాటకాలు రాశాడు. రేడియో ప్రసంగాలు చేశాడు.

ఆ తర్వాత ఆయన గొంతుక పోయింది. కాగితాల మీద (చిన్న చిన్న నోటుబుక్కుల మీద) అక్షరాలు రాస్తూనే, తన దగ్గరకు వచ్చిన అందరితోనూ ప్రసంగించాడు. ఎన్నో ట్రంకు పెట్టెల నిండా ఈ నోటుబుక్కులున్నా యని బుజ్జాయి (కృష్ణశాస్త్రిగా రబ్బాయి) నాతో చెప్పాడు

ఒక దానిలో కృష్ణశాస్త్రిగారు నా మీద ఇలా రాశారట: "శ్రీశ్రీ గొప్పకవి. అతని మీద ఈగ వాలినా నేను సహించలేను" అని!

నా మీద వారి కెప్పుడూ సదభిప్రాయమే ఉంది. మరి వారి మీద నాకు వల్లమాలినంత అభిమానం. నా మనస్సు మీద చెరగని ముద్రలు వేసిన ముఖ్యాతి ముఖ్యులలో కృష్ణశాస్త్రిని ప్రముఖంగా పేర్కొంటాను.

వారి మీద నా కున్న అభిమానం, అపేక్ష, వారి యీ గ్రంథ సంపుటాలకు గాను ఈ రాత రాయడానికి ప్రేరేపించాయి. మరో మారు చెబుతున్నాను. ఇది ఇక్షు సముద్రం. "అందరం ఆస్వాదించుదాం, రం" డని ఆహ్వానిస్తున్నాను.

మద్రాసు,
29-11-81

శ్రీ శ్రీ

# భూమిక

"నా నోట నీ మాట గాన మయ్యే వేళ
నా గుండె నీ వుండి మ్రోగింపవా వీణ? . .
అంతరాంతరము నీ అమృత వీణే యైన
మాట కీర్తన మౌను, మనికి నర్తన మౌను!"

– గీతం 58

శ్రీకృష్ణశాస్త్రి వ్యక్తిత్వం 'అంత రాంతరాల' లో నిండి ఆయన ప్రతి మాటనీ కీర్తనగా, మనికిని నర్తనగా తీర్చిన 'అమృత వీణ' ఇది. భౌతికంగా గొంతు మూగపోయిన తరువాత కూడా జీవితాంతం పలుకుతూ వచ్చిన వీణ! ఎంత వైయక్తికమో అంత విశ్వజనీనం ఈ వీణ!

ఏడు తంత్రులు ఈ 'అమృత వీణ'కి: కృష్ణ రజని, కన్నీరు, ఋతు ఖేల, విరి తూపు మొదలైనవి. నిరాశ, కరుణ, ఆర్తి, భక్తి, ప్రణయం, ప్రకృతి ఆరాధన, గోపికా కృష్ణుల పుణ్యప్రేమ వంటి సప్త స్వర శింజితం ఈ 'అమృత వీణ.'

కృష్ణశాస్త్రి సాహితిలో గేయ సంహిత రెండు సంపుటాలు. మొదటిది 'అమృత వీణ.' రెండవది 'మంగళ కాహళి' – దేశభక్తి గీతాలతోనూ, తెలుగుజాతి జీవన సన్నివేశ కీర్తనలతోనూ కూర్చింది.

'అమృత వీణ'లో కన్నీరు, మహతి అనే శీర్షికల కింది పాటలు తప్పిస్తే తక్కిన వన్నీ మొదటిసారిగా గేయసంపుటంగా వెలువడుతున్నాయి. వెనుక అచ్చయినా, 'కన్నీరు' గాని, 'మహతి' సంపుటం గాని ఇప్పుడు అలభ్యాలు. అదీ కాకుండా అవి లేకపోతే

'అమృత వీణ'కు నిండుతనం రాదు అనే ఉద్దేశంతో ఆ పాటలు ఈ సంపుటంలో చేర్చాము

ఈ పాటలలో కొన్ని శ్రవ్య నాటికలనుంచి గ్రహించినవి. చాలాభాగం గాయనీ గాయనుల ద్వారా లభించినవి

శ్రీ కృష్ణశాస్త్రి పాటలలో ఒక విశేషం - శ్రవ్యనాటికకి వ్రాసినా, మరో ప్రత్యేక సన్నివేశంకోసం వ్రాసినా సన్నివేశ నిరపేక్షంగా స్వతంత్ర భావ గీతాలుగా అవి ఆస్వాదించ దగి ఉండడం.

ఇది గాయకుల కోసం స్వరాలతో ప్రకటిస్తున్న సంపుటం కాదు కనుక కేవలం సాహిత్య దృష్టితోనే, పర నానుకూలంగానే ఈ పాటలు అచ్చువేయబడ్డాయి. కావాలంటే గాయకులు యధాను కూలంగా పల్లవి తిరిగి తిరిగి అనవచ్చు అవసరమైతే హ్రస్వాలు దీర్ఘాలు చేసుకోవచ్చు.

పాటలను రచనా కాలాన్ని బట్టి కూర్చడంవల్ల కొన్ని లాభాలు ఉన్నా, విషయ సామ్యం ఉన్న గీతా లన్నీ ఒక చోటికి రావు అందుచేత విషయ ప్రధానంగానే ఈ పాటల కూర్పు జరిగింది

'వ్యాసావళి' లాగే గేయ సంహిత కూర్పు కూడా 'కృష్ణశాస్త్రి సాహితి' అధ్యయనానికి రసజ్ఞులకు తోడ్పడితే సంపాదకుల శ్రమ నిరర్థకం కాదు.

ఈ గేయ సంహిత సంపాదక బాధ్యత వహించే అవకాశం మాకు కలిగించిన రాజహంస ప్రచురణల అధిపతి చిరంజీవి బుజ్జాయి (దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి)కి కృతజ్ఞులం!

సంపాదకులు

# మున్నుడి

ఈ సంపుటిలోని వన్నీ గేయాలు. కృష్ణశాస్త్రి గారి గేయాలు. గేయాలు అంటే పాడదగినవి, లేక పాడవలిసినవి కృష్ణశాస్త్రిగారిని గురించి తెలిసున్న ప్రతి ఒక్కరూ ఈ సంపుటిలోని గేయాలలో కొన్నిటినో, అన్నింటినో ఎవరో ఒకరు పాడగా వినే ఉంటారు. పాటలుగా వింటే తప్ప వీటిలోని అంద చందాలు పూర్తిగా అవగాహన కావు.

వీటిని ఖండ కావ్యాలుగా చదువుకోవచ్చు. వీటిలోని కవితా మాధుర్యాన్ని, పలుకుబడులలోని వైచిత్రిని, పదచిత్రాల వైశిష్ట్యాన్ని, భావ సౌకుమార్యాన్ని మెచ్చుకోవచ్చు. అయితే ఇవి చదువు తున్నప్పుడే వీటిలో అంతర్భూతంగా ఏదో సంగీతం ఉందని పిస్తుంది, పాడుకోవా లనిపిస్తుంది గొప్ప వాగ్గేయకారుల రచనల ప్రత్యేక లక్షణం అది.

అన్నమయ్య, త్యాగయ్య, క్షేత్రయ్య వంటి వాగ్గేయకారుల compositions లో కవితా శిల్పం కన్న, గాన శిల్పానికి ప్రాధాన్యం ఎక్కువ. అన్నమయ్య, త్యాగయ్య కృతులను చదువుతున్నప్పుడు వాటిలో కొన్ని కవిత్వ దృష్ట్యా పేలవంగా అనిపించవచ్చు. పాడు తున్నప్పుడు ఆ పదాలకే మరొక పరిమాణం, మరొక లోతు, గాంభీర్యం సంక్రమిస్తుంది, హృదయాన్ని కదిపే శక్తి వస్తుంది. కృష్ణశాస్త్రి గేయాలు అన్నీ తీర్చి దిద్దిన ఖండకావ్యాలు. వాటిలో కవితా శిల్పం కొరవడదు. ఊరికే చదివినా పేలవంగా అనిపించవు.

కృష్ణశాస్త్రి గాయకుడు కాడు. కాని గొప్ప వాగ్గేయకారుల లక్షణం ఒకటి అయనలో ఉంది. కృష్ణపక్షం, ప్రవాసం, ఊర్వశి

వ్రాసిన నాటికి, బ్రాహ్మ ప్రార్థన గీతాలు వ్రాసిననాటికి ఆయనలోని కవి మాత్రమే ప్రస్ఫుటంగా కనిపిస్తాడు. గాయకుడు అజ్ఞాతంగా మాత్రమే ఉన్నాడు. తరువాత తరువాత, రేడియో చలనచిత్ర రంగాలతో సన్నిహిత సంబంధం ఏర్పడ్డాక, ఆయనలోని కవితో పాటు, గాయకుడు కూడా ఎంతగానో పెరిగాడు. అంతే కాదు, గాయకుడు ఆయనలోని కవిని తీర్చి దిద్దాడు కూడా.

భావకవి త్వోద్యమపు మొదటిరోజుల్లో, పాత ఛందస్సులకు స్వస్తి చెప్పి, గేయరచనకు పూనుకుని, గేయాలకు సాహిత్య గౌరవం సంపాదించిన ప్రముఖు లందరిలాగే, కృష్ణశాస్త్రి కూడా తన గేయాలకు మాత్రా ఛందస్సునే ప్రాతిపదికగా చేశాడు. తెనుగు జానపద రచనలలో అయిదు మాత్రల ఛందాన్ని విరివిగా వాడ్డం సంప్రదాయం. భావకవులు ఆ ఛందాన్నే ఎక్కువగా తమ గేయాలకు ఉపయోగించారు. అయిదు మాత్రల నడకకీ, తెనుగుకీ ఏదో స్వాభావికమైన అనుబంధం ఉంది. 3,4, 6,7 మాత్రల ఛందాలు అక్క డక్కడ వాడినా, కృష్ణశాస్త్రి తొలి గేయాల్లో ఎక్కువ భాగం ఖండగతిలో నడిచినవే 'ఆకులో ఆకునై'. 'కన్నీటి కెరటాల'.. 'శిధిలాలయమ్ములో' మొదలైన ప్రసిద్ధ గేయా లన్నీ ఖండగతిలో వ్రాయబడ్డవే. వీటిని రాగబద్ధం చేసి, పాడి, ప్రచారం లోకి తెచ్చిన ఘనతలో ఎక్కువ భాగం శ్రీమతి అనసూయకు చెందుతుంది. మరికొన్ని రజని, ఒకటి రెండు బి వి. నరసింహారావు, ఒకటి స్థానం పాటలుగా తీర్చిదిద్దారు. సాహిత్య సమావేశాల్లో ఈ పాటలు అనసూయా సీతలో, రజనో పాడ్డం కార్యక్రమంలో భాగం అయిపోయింది. ఆ ట్యూన్లకూ ఆ పదాలకూ అవినాభావం ఏర్పడి, రచన, పాట ఒకరివే అన్నంతగా కలిసిపోయాయి.

రేడియోతో సంపర్కం ఏర్పడ్డాక, రక రకాల గాయకులతో సాన్నిహిత్యం ఎక్కు వయాక, కృష్ణశాస్త్రి గేయ రచనా శిల్పంలో

ఎంతో మార్పు వచ్చింది. మౌలికమైన మార్పు! తెనుగు జానపద గేయాలలోనూ, కీర్తనలలోనూ, ముఖ్యంగా పదాలలోనూ వాగ్గేయ కారులు చిత్రంగా స్వతంత్రించారు. రచన అయిదు మాత్రలదైనా, దాన్ని పాడ్డంలో 6, 7 మాత్రల తాళాలకు పెంచి పాడ్డం, అందువల్ల ఆ పాటలకు చిత్రమైన కొత్తదనం రావడం కృష్ణశాస్త్రికి కనువిప్పు కలిగించింది. ఆ తరవాత ఆయన వ్రాసిన గేయా లన్నీ, (ఇంచుమించు) ఎవరో ఒక ప్రముఖ గాయకుణ్ణి - ఏ రజనినో, విశ్వనాథాన్నో, పి.బి. శ్రీనివాస్‌నో - ఎదురుగా కూర్చోబెట్టుకుని, ట్యూన్‌తో పాటు పదాలు బిగించి వ్రాసినవే అయితే, ఆ రచనల వాగ్గేయ స్వరూపానికి పూర్తి బాధ్యత కృష్ణశాస్త్రిదే! ఆయన ఒక పంక్తి వ్రాసి ఇచ్చేవారు దానికి ట్యూన్ అజ్ఞాతంగా ఆయనలో ఏదో ఉండేది. గాయకుడు ఆ పంక్తి రక రకాల తాళాల్లో, రాగాల్లో అనగా అనగా, ఆయన అనుకున్న వరస చటుకున తగిలేది. 'ఇదీ ఈ పాటకు వరస' అని ఆయన నిర్ణయించే వారు. ఆ తరవాత మిగిలిన పాదాలు మెల్ల మెల్లగా పూర్తి అయేవి - సంగీతంతో పాటు చటుకుని సంగీతంలో ఒక మెలకువ, ఒక విరుపు తగిలేది. దానికి మాట దొరికేది కాదు. కాని ఆ విరుపు మార్చడానికి ఆయన ఒప్పుకునేవాడు కాడు. 'దానిలో ఇమిడే తెలుగుపదం ఉంది - గుర్తొస్తుంది' అనేవాడు అది గుర్తు వచ్చేవరకూ పాట ఆగిపోయేది. గుర్తొచ్చిన తరవాత 'ఆహా!' అనిపించేది. అందువల్ల ట్యూన్ చేసిన వారు ఎవరైనా, దాని ఘనతలో చాలా భాగం కృష్ణశాస్త్రిదే. అందుకే ఆయన గొప్ప వాగ్గేయకారుల కోవకు చెందినవా డన్నాను. అందువల్లనే ఆయన గేయాలలో ఎక్కడా వెలితి కనబడదు - సంగీతం దృష్ట్యా చూసినా, కవిత్వ దృష్ట్యా చూసినా!

ఈ సంపుటంలో తొలినాటి గేయాలూ, మలినాటి గేయాలూ కలిసిపోయాయి. విషయ సామ్యాన్ని బట్టి విభజన జరిగింది గాని,

రచనలు పుట్టిన కాలాన్నిబట్టి కాదు అయితే ఏ కాలంలో వ్రాసినా, కృష్ణశాస్త్రి ముద్ర ప్రతి గేయంమీాదా ఉంటుంది.

పండితులు, విమర్శకులు ఒక కవి రచనలలోనుంచి ఏదో ఒక తాత్త్వికసూత్రాన్ని పిండడానికి ప్రయత్నించడం జరుగుతుంది వారికి ఈ గేయ సంపుటి ఒక గడ్డుసమస్య అయిపోతుంది ఇందులో ఎన్నో భగవానుణ్ణి ఉద్దేశించిన గేయా లున్నాయి ఒకొక్కప్పుడు ఆయన పిలిచే భగవానుడు నిర్గుణుడు, నిరాకారుడు ఒకొక్కప్పుడు స్పష్టమైన మూర్తితో సాక్షాత్కరించే రాముడో, కృష్ణుడో, శివుడో! అంతే కాదు. ఒకొక్క గేయానికి వెనక ఉన్న భక్తులలో కూడా ఎన్నో భేదా లున్నాయి. ఒక గేయంలో సూఫీ తత్త్వజ్ఞుడు పర దైవతాన్ని గురించి పాడతాడు మరొక్క గేయంలో భక్తుడు దీనుడు, దారి తెలియని చీకట్లో అల్లలాడే బాధా జీవి. ఇంకొక్క గేయంలో భగవంతుణ్ణి ఆప్యాయంగా అపహసించే సామాన్యుడు. భగవత్స్వరూపాన్ని వివిధంగా దర్శించే రక రకాల భక్తులుగా కవి మారిపోతాడు ఒకొక్క భక్తుడు కృష్ణశాస్త్రి ఒకొక్క అవతారం. అందువల్ల అసలు కృష్ణశాస్త్రి తాత్త్వికదృష్టి ఏదో ఎవరికీ అందదు బెర్నార్డ్ షా 'For the dramatic moment I'm each one of the characters in my plays' అన్నాడు. అలాగే ఒకొక్క గేయంలోని భావావేశంలో ఒకొక్క విభిన్న మూర్తి అయిపోతాడు కృష్ణశాస్త్రి. అయిపోయి కూడా అసలు కృష్ణశాస్త్రిని స్ఫురింపజేస్తాడు. ఆయన 'నేను మానవతావాదిని', 'వట్టి హృదయ వాదిని' అని అంటుండేవాడు. అందుకే ఆయన ప్రతిగేయంలోనూ గుండె పలుకుతుంది - మనిషిగుండె - విరాట్ స్వరూపం దాల్చిన మనిషి గుండె!

- పద్మరాజు

# అనుక్రమణిక



www.vaaradhionline.com

★

రేయి పడినది సకియ! యేమే యళింద
మందు దీపమ్ము పెట్టవు మందిరాన?
మూసెనే కారు నీడలు మూల మూల
లూరకే కృష్ణరజని నిట్టూరుపు లటు

★

# కృష్ణ రజని

"నాకు మూగతనం వచ్చాక, సినీమా పాటలు గాక, కొత్త lyrics వ్రాస్తున్నాను. హైదరాబాదులో ప్రారంభించాను. ఆ lyrics మొత్తం పేరు 'కృష్ణ రజని' అని - అంటే చీకటి రాత్రి అని అర్ధం. అంతే గాక కృష్ణశాస్త్రి సాహిత్యం, రజని* music అని." - కృష్ణశాస్త్రి

---

* అయితే - అన్ని పాటలూ రజనికో కూర్చని వ్రాయడం పడలేదు.

www.vaaradhionline.com

★

నీ ఆన యైన, స్వామీ, నా
  ఔదల నిడికోనా?
"పోనీలే! నీ దయ ఇం
 తే" నని అన్నానా?          నీ ఆన యైన . .

మాట తీసుకొని నాకు
మౌన మొసగినావు!
మౌన మందికొని నీకు
గాన మియ్య మంటావు!       నీ ఆన యైన . ..

నా కంఠము చీక టైన
ఈ కృష్ణ రజని తుదిని
నా కయి నీ చెయి చాచిన
నా కానుక ఇంతే గద!
ఈ కొంచెపు పాటే గద!    నీ ఆన యైన ...

www.vaaradhionline.com

# 1

ఎవ రది ?
　　ఎందుకు తీరిచి కట్టారు,
ఈ నక్షత్ర తోరణాలను
　　ఈ కృష్ణ రజనీ మార్గంలో ?

ఎవ రది ?
　　ఎందు కింత దయ ?
ఈ కృష్ణ రజనీ మందిరానకు
　　ఎందుకు పంపుతున్నారు,
మంగళ వార్తలను
　　మంద పవన పర్ణాలపై ?

ఎవరో గాని !
　　ఎందుకు వినిపిస్తున్నారు,
ఈ కృష్ణ రజనీ శ్రుతులకు
　　దూర విభాత విహాగీ కలకలాన్ని ?

# 2

ఒదిగిన మనసున పొదిగిన భావము
కదిపే దెవ్వరో ! కదిపే దెవ్వరో !

కదలని తీగకు కరగిన రాగము
కరపే దెవ్వరో ! కరపే దెవ్వరో !
కదిపే దెవ్వరో ! కరపే దెవ్వరో !
కరగని మనసును, కదలని తీగకు ?

హృదయము రాయిగ గళమున రేయిగ
కదలని దీనుని గతి యిక ఎవ్వరో ?
నా కయి ప్రాణము గానము తానయి
నడిపే దెవ్వరో ! నడిపే దెవ్వరో !
కదిపే దెవ్వరో ! కరపే దెవ్వరో ?

www.vaaraadhi.com

# 3

ఎందు కొరకు – ఎవరి కెరుక ?

ఎగుడు దిగుడుల బ్రతుకు

ఎందు కొరకు?

తెగ దా సమస్య

ఈ నాటి వరకు !

చిగురు పెడితే వసంత మ్మని

ఎగసి పడి

మొగిలు పడితే వాన కా రని

దిగులుపడి

ఎగసి పడి దిగులు పడి

సొగసి పోవుటె గాని ఎందు కొరకు?

వెలుగు నీడల పడుగు పేకలా ఎవరు

కలిపి నేసిరొ బ్రతుకు కోకలా

ఆసల నిరాశలను తొరపి, ఎవరు

పోసిరో ఈ బ్రతుకు మూనలా

అయితే – బ్రదు కంత యిది వ్యర్ధ మైనదా ?

కాదు – పరికిస్తె ఎదొ అర్ధమున్నదీ !

ఎందు కొరకు?

అరుణ కాంచన మేఘమాల కౌగిలిలో
ఎరి గెరిగి ఎవరో చీకట్లు ప్రాకిస్తారు
అలము కొన్న కారు రేయి లోగిలిలో
తెలిసి ఎవరో తార దివ్వె పెడతారు
ఎందు కొరకు ?

(పద్మరాజు గారి 'వెలుగు వీడలు' నాటకానికి theme song గా వ్రాసినది)

www.vaaradhionline.com

# 4

ఎవ్వరూ నన్ను వినరు
ఎవరు నావైపు కనరు
ఇంత విపణిలో ఎన్ని అంగడులు!
ఇచ్చి పుచ్చుకొను సందడులు! ఎవ్వరూ .

నే నడిగే దేదీ దొరకదు
నే నిచ్చే దెవరూ అడగరు
'ఏది చూపు మే సర కుం' దంటే
ఏకతార చూపించా అంతే! ఎవ్వరూ .

కొరగాని వట్టి సోమరిని,
అక్కరకు రాని ద్రిమ్మరిని!
అరగడి యేనీ తీరిక లేని
పదుగురిలో నే ప్రవాసిని ఎవ్వరూ .

ఎవరూ వలవని నా పాట
ఏ దొర చెవినో చేరు
ఎచటనో ఉంది ఆ దర్బారు
అచటికి పైనం జరూరు! ఎవ్వరూ .



www.vaaradhionline.com

## 5

ప్రతి కోవెలకూ పరుగిడకు!
ప్రతి బొమ్మకు కై మోడ్చకు –
గతిమాలిన వెంగలివై, పాపము,
వెతకే వే పెన్నిధికై సతతము?
ప్రతి కోవెలకూ–

అస లడుగే పడక పోతేనో?
అస లాశలే అలసి పోతెనో?
విసిగి విసిగి నీ కన్నుల లోపలి
వెలుగే ఆరి పోతేనో?
ప్రతి కోవెలకూ–

తీరని దాహము దేనికై, వే
సారని మోహము దేనిపై?
క్షీర జలధి నీలోనే నిండగ,
ఆరని దీపము లోలో ఉండగ –
ప్రతి కోవెలకూ –

www.vocaldiary.online.com

# 6

చేతులు జోడించి
చేయుము దర్శనము
శ్రీ పదముల దీనుడా !
జీవన మర్పింపుము చేతులు

ఒరిగి పడును ప్రేమధార
ఉరలి అమృత లహరులై
శిర సుంచుము నేల, శు భా
శీ ర్వార్షా కణములకై చేతులు . .

అదిగో ! వెలు గదిగో !
ఆ ఫాల ఫలకమున !
ఒదిగిన నీ శీర్షముపై
ఒక కిరణము వాలనీ ! చేతులు . .

నిఖిల చరా చరముల నిం
డినది శాంతి సాగరము
నిశ్చలముగ తీరమ్మున
నిలబడు మొక క్షణ కాలము చేతులు ....



www.vaaradhionline.com

# 7

ఎపు డైనా ఒక క్షణ మైనా
ఏకాంత దర్శన మీవా ? దేవా!
ఎదు రెదురుగా నీవూ, నేనే -
ఏకాంత దర్శన మీవా ?

చిన్ని పువ్వు పదములపై ఒకటే,
కన్నీటి చుక్క లాపై రెండే —
బెదరిపోను సుమ, బిడియపడను సుమ -
చెదరకుండ నీ వైపే చూస్తా!
ఎపుడైనా

అపుడు వెలిగింతు చిరునవ్వుల
కర్పూర దీప కళిక,
అపుడు వినిపింతు మది నాదిగిన ఒక
అలతి పాట తునుక
ఎపుడైనా

www.vaaradhione.com

# 8

అఖిల లోకేశ్వరా! ఆలింపు మనవి
ఆశ్రితమందార! ఆలింపవయ్యా!

చేరి కొలువున నిలుచు టెన్నడో - ఎన్నడో!
కోరి అడుగుల కొలుచు టెన్నడో - ఎన్నడో!

కన్ను లశ్రువులలో కరిగి పోయే దాక
నిన్ను నా ప్రభుని గను టెన్నడో - ఎన్నడో!

హృదయ పీఠిక పరచు టెన్నడో - ఎన్నడో!
మృదుల సుమముల ఉంచు టెన్నడో- ఎన్నడో!

పదిలముగ నిను దానిపై, ప్రాణవల్లభా!
కదలకుండా నిలుపు టెన్నడో - ఎన్నడో!

ఊరుపులతో విసరు టెన్నడో - ఎన్నడో!
హారముల కైసేయు టెన్నడో - ఎన్నడో!

నోరు వాయీ లేని నుతులతో — నా తండ్రి
మూరితిని కీర్తించు టెన్నడో — ఎన్నడో!

## 9

ప్రభు ! ప్రభు ! ప్రభు ! దీనబంధు !
ప్రాణేశ్వర ! దయా సింధు !
అభయ మభయ మఖి లేశ్వర !
ఆశ్రిత జన తార్తిహరా !

ఎంత చించుకొన్న మనసు
ఏమీ తెలియదు వైనం !
వింత వెలుగు చీకట్లను
వెడలి సాగు పైనం !
అంతు పొంతు దొరకనీయ
దయా నీ విధానం !
ప్రభు ! ప్రభు ! ప్రభు !

ఒకపరి నా జీవిత మిది
తారా మందార మౌను !
ఒక్కసారి నేల జారి
ఓప లేని భార మౌను !
ఒక గడియయు విడువబోకు !
ఓపిక ఇక లేదు, తండ్రి !
ప్రభు ! ప్రభు ! ప్రభు !

ఇప్పుడు సుధాపూర మిడి,

అప్పుడు విషాహార మిడి

ఎప్పుడు పట్టి దండింతువొ!

ఎపుడు సుఖము పండింతువొ!

ఎప్పు డేయది గానీ, నీ

కృపయే అని ఎంతు గాని!

ప్రభు! ప్రభు! ప్రభు!

www.vaaradhionline.com

## 10

ఎక్కడ నుండో ఈ పిలుపు!

ఎందుకు నా కీ మైమరపు?

ఇందుండీ, అందుండీ,

ఉం డుండీ, ప్రతిపాద నుండీ

ఎక్కడ నుండో

ఒకసారి మరీ ఒత్తిడిగా

వడివడిగా

ఒకతూరి లేత సవ్వడిగా

జడిజడిగా

ఒక క్షణ మేనీ ఊరుకోదు

సుకముగా నిదుర పోనీదు

ఎక్కడ నుండో....

ఎవరిదో పిలుపు తెలియదు

ఎవరో వారు చూడ లేదు

మనసు మనసుపై ఒరిగి, ఒరిగి

మధుర రహస్యం ఊదినట్టు

ఎక్కడ నుండో...

www.vaasradhionline.com

# 11

ఖుదా ! నీదే
అదే పిలుపు !
ఖుదా ! నీదే
సదా గెలుపు !
లోక లోకములు నిండి, నా
లోన నిండి, లోలోననుండి ఖుదా!

నీ వాకడవే నా సేతవు !
నీ వాకడవే సంత్రాతవు !
నీవే నీవే నిరంతరం నా
జీవితమునకు విధాతవు ! ఖుదా !

వదలిపెట్టవే పాపిని !
వదల వెట్టి సంతాపిని !
ఎదురు లేదు నీ యిచ్ఛకు !
కొదువ లేదు నీ ప్రేమకు ! ఖుదా !

నా పదముల నీవే నడుపుము !
సత్పథముల నీవే చూపుము !
బెదరనీకుమా నా చూపు !
బెదరనీకుమా నీ ప్రాపు ! ఖుదా !. .

(ఒక సాయంత్రం హైదరాబాదులో నమాజు పిలుపు విని)

# 12

ఎప్పుడు నీ పిలుపు వినబడదో
అప్పుడు నా అడుగు పడదు
ఎచటికో పైన మెరుగగక
ఎందుకో వైన మందక!

చిరిగిన నా జోలెలో
వర మేదీ అగపడదు
బిగిసి ఏకతార గొంతు
పెగలనే పెగలదు
అప్పు డేదో మనసులోన
అదే తపన! తపన! ఎప్పుడు ..

అలసి నపుడు కాస్త ఒరిగి
నిలువనీని పిలుపు విని
అంత లోనె లేచి జరిగి
అంతు లేని దారిని
అదే నడక! నడక!
ఎదో ఆశ విడక ఎప్పుడు

ఆగి ఆగి మ్రోగి మ్రోగి
అదే పిలుపు! పిలుపు!


www.vaaradhionline.com

ఆగి ఆగి సాగి సాగి
అదే నడక! నడక!
తెమలనీవు నా జాతర
తెలవారదు కృష్ణరజని ఎపుడు

www.vaaradhionline.com

## 13

నీ యింటికి పిలువకు, నను
లోనికి రమ్మనకు !
రే యని, నీ వీధిని బడి
పోయే ఏకాకి నని
నీ యింటికి పిలువకు !

దారి వెంట కల లేవో
సారె సారె ఏరుకుంటు
ఏ రెరుగని పాట ఏక
తార పైని మీటుకుంటు
పోయే వానిని – వీనిని
నీ యింటికి పిలువకు -

తలుపు తీసి పిలిచి నటుల
తల ఊపకు !
అలవి గాని మమతలు
నా యెడ చూపకు –
న న్నాపకు !

నిలువ రాదు, కృష్ణ రజని
తెలవారగనే స్వామి
కొలువున మంగళ విభాత
కలగీతిక పాడవలయు -
నీ యింటికి పిలువకు !

మురలి వెడలి పోకుమా!
కరుణ క్షణము నిలబడుమా!
తెలివి మాలి నా హృదయము
తలుపు మూయబడిన
తొలగ దోసి ద్వారము, లో
పలికి రావలయు ప్రభూ! మరలి -

ఏమరుపాటున, నీ ప్రియ
నామ మెన్న డైన గాని,
నా వీణియ పలుక కున్న
దేవా! ఆవంత సైచి మరలి -

నీ పిలుపును వినక, గాడ
నిద్రలోన మునిగి యున్న
నిఘ్న రామాతముతో
నీవే మేలుకొలిపి, ప్రభూ! మరలి -

ఎన్న డైన లోభమున, మ
రెవరి నైన నీ పీఠిక
నాసీనుని చేసినను
నా నేతవు నీవే గద! మరలి -

# 15

నేటికి కోవెల తలుపు పూర్తిగా తెరిచాను ;
నీ కోసం పీఠం ఆయత్త పరిచాను,
నీ వింక దిగి రావచ్చు ,
దిగి రా !
స్వచ్ఛ చంద్రాతప ధారవై దిగి రా !

కోవెల తలుపులు పూర్తిగా తెరిచాను ,
మ రెవ్వరికీ దానిలో చోటు లేదు
నీవే రా ! దిగి రా !
దిగి రా!
సంఫుల్ల మందార మధు ధారవై దిగి రా !

కోవెల తలుపులు పూర్తిగా తెరిచాను ,
నేటికి నీ కోసమే తెరిచాను
రా యింక !
దిగి రా !
సహస్ర సహస్ర నక్షత్ర తంత్రీ
సంగీత ధారవై దిగి రా ,
ఈ కృష్ణ రజని లోనికి దిగి రా !

www.vaaradhionline.com

# 16

తెరచినాను తలుపు
పరచినాను పానుపు
త్వరగా రాలేవా, నా
కొరకని ఈ కృష్ణ రజని తెరచి -

మరి చుక్కలు లెక్కించుచు
జరపలేను రాతిరి !
మరి దిక్కులు పరికించుచు
మననేరను వేసరి !
త్వర త్వరగా రావా -

ఇక వాకిలి మూయను
ఎవరి నింక రానీయను
ఒకరే నా కింక అతిది
ఒకరికె నా యింట వసతి !
త్వర త్వరగా రావా -

# 17

ఎలా గైన రావా
　　ఇటే ఉండి పోవా
ఎలా గైన రావా

ఇలా దిక్కుమాలి, జాలి
　　ఎన్నాళ్లు దేవా,　　ఎలా గైన -

ఎవ రేని లేని దీన
　　ఏకాకి భాగ్యహీన
పవలు లేని రేయి
　　బాత మాయె నోయి　　ఎలా గైన -

వియోగాన ఎన్నో
　　వసంతాలు పోయె
ఇటే నిల్చి యున్న దాన
　　కుటీ రాంగణాన　　ఎలా గైన -

ఇలా ఎదురు చూసి చూసి
　　ఎడద పగులు నేమో
నోగులు మిగులు నేమో
　　ఎలా గైన రావా
　　ఇటే ఉండిపోవా

# 18

ముందు తెలిసెనా, ప్రియ ! ఈ
మందిర మిటు ఉంచేనా ?
మందమతిని, నీవు వచ్చు
మధుర క్షణ మేదో కాస్త
ముందు తెలిసెనా

అందముగా, నీ కనులకు
విందులుగా వాకిటనే
సుందర మందార కుంద
సుమదళములు పరవనా ?
ముందు తెలిసెనా .

బ్రదుకంతా ఎదురు చూచు
పట్టున రానే రావు—
ఎదు రరయని వేళ వచ్చి
ఇట్టె మాయ మౌతావు !
కదలనీక, కృష్ణ రజని
గడచుదాక నిలువగ నీ
పదముల నా హృదయము
బంధింపలేను సంకెలగా !
ముందు తెలిసెనా

(మార్చి వ్రాసుకున్న పాఠం)

ముందు తెలిసెనా, ప్రభు! ఈ
మందిర మిటు లుంచేనా?
మందమతిని, నీవు వచ్చు
మధుర క్షణ మేదొ కాస్త
ముందు తెలిసెనా

అందచందముల ముగ్గులు తీర్చనా?
మందార సరాల నెన్నొ కూర్చనా?
సుందరముగ చేయనా? ఇటు
తొందర లైపోయె గాని –
ముందు తెలిసెనా

రేదు కంతా ఎదురుచూచు
పట్టున రానే రావు–
ఎదు రరయని వేళ వచ్చి
ఇట్టె మాయ మౌతావు!
దారి పొడుగునా మంచున తడిసిన
పారిజాత సుమములపై నడిచిన
నీ అడుగుల గురుతులె ఈ
వీట నిలిచె నా కోసము–
ముందు తెలిసెనా....

## 19

ప్రతి క్షణము నీ గుణ కీర్తనము
పారవశ్యమున చేయుదును !
పదములు నీవే యిమ్ము ! నీవే
పాడే సుస్వర మిమ్ము !

ప్రతి క్షణము -

నా వికచ హృదయ కమలాసనమున
నీవే కొలు వైతే -
నా వివృత జీవ పాత్రిక లోన
నీ ప్రేమ నింపితే

ప్రతి క్షణము -

నా దుఃఖము నీ చేతుల కప్పి,
నా సుఖ గర్వము దవ్వుల కనిపి
నా యెదుట నిలిచి నా గానమును
నీవే ఆలకించితే—
నీ ఉదార నయనమ్ముల సుధలు
నా పైన చిలకరించితే

ప్రతి క్షణము –



www.vaaradhionline.com

౧౦

ఎదురుగ నిలబడుదు ప్రభూ !
ఈ చేతులు జోడించి
ఈ జీవిత మిక నీవే
నీవే నడిపింతు వని

ఎదురుగ –

అంతు లేని మింటి కింద
అన్యు లెవరు లేని చోట
అఖిల లో కావనా !
అశ్రులతో, అణకువతో

ఎదురుగ –

చిత్ర విచిత్రము ధాత్రీ
జీవిత కోలాహలమున
జను లందరి నడుమ, నా
పనులు ముగియగానే
ఏ సవ్వడి చేయకుండ
ఏకతముగ అరుదెంచి
ఎదురుగ నిలబడుదు
రాజరాజేశ్వరా !

www.vaaradhionline.com

# కన్నీరు

www.vaaradhionline.com

'కన్నీరు' 1923 లో ప్రచురిత మైంది. ఆ ప్రతులు ఇప్పుడు అలభ్యం. మధ్య మధ్య పద్యాలతోపాటు, అందులో 20 కీర్తనలు కూడా ఉన్నాయి ఇవి 1918, 1923 మధ్య వ్రాసినవి. వీటితో చివర చేర్చిన నాలుగు పాటలూ 1924 - 1927 ప్రాంతాల రచించినవి

## — ఆ రోజుల గురించి చలం —

ఒకసారి ఒక పాట వినిపించారు మా కెవరో. అది బ్రహ్మ సమాజ వుపాసనలో మంగళ హారతి "జయము జ్ఞాన ప్రభాకరా" అన్నది. అది విని చాలా అద్భుతపడి పోయినాను - ఎవరు ఇది రాసిందీ అని! అది కృష్ణశాస్త్రి రాశాడు అన్నారు అటు తరువాతే రామ్మూర్తి స్నేహంలో "రండు, మన జీవితముల కోరుచున్నది మన బ్రాహ్మధర్మము" అని inspirational songs కూడా రాశాడు

Literary గా అది ఆంధ్ర బ్రహ్మ సమాజానికి hectic period 'ధర్మసాధని', 'బ్రాహ్మ మెసెంజర్' మొదలైన పత్రికలు, చలం వ్యాసాలు, కృష్ణశాస్త్రి కీర్తనలు- ఇవన్నీ ప్రబలిన రోజు లవి ఆ దిగ్విజ యోత్సాహంలో, కృష్ణశాస్త్రి దో ముఖ్యమైన పాత్ర. అతను బ్రహ్మసమాజా నికి ఆ రోజుల్లో ఒక వన్నె తెచ్చాడు. అతని రూపం, అతని వుత్సాహం, అతని కవిత్వధోరణి అన్నీ బ్రాహ్మ మత వ్యాప్తికి తోడ్పడ్డాయి ఏ దవ్నా ఓ ఉత్సవం జరిగితే, దాని కనుగుణ్యంగా ఒకపాట రాసిపెట్ట మంటే, వెంటనే కృష్ణశాస్త్రి పాట రాసి యిచ్చేవాడు.

పాటల అందం అంతా శాస్త్రిదే ఉద్రేక మంతా చలానిదే. వాయుడిగారి sermons, చలం sermons, ప్రార్థనలు మొద లైన వాటిల్లోని ideas తో కృష్ణశాస్త్రి పాట లల్లేవాడు.

(ధర్మసాధని; 15-5-1974)

అలా అల్లిన పాటలు చాలా వరకు ఈ 'కన్నీరు.'

# 21

కన్న తండ్రీ ! వేచియుంటి
కరుణా వృష్టికి వేచియుంటి
నిన్ను గన నాపన్నుడనై
ఎన్ని నాళ్లో వేచియుంటి

హృదయమున నానంద మెరుగ,
నెరుగ చిత్త శాంతము
నిదుర నెరుగ, సుఖము నెరుగ
వెదకుచుంటి వెదకుచుంటి
కన్నతండ్రీ! వేచియుంటి

భూరి దుఃఖ కాననమున
ఘోర కలుష తిమిరమున
దారి గానక పోవ నేరక
తడయుచుంటి వెదకుచుంటి
కన్నతండ్రీ ! వేచియుంటి

సానుతాప గానముతో
సానురాగ గీతముతో
మేను మరచి నిన్నె వలచి
వెదకుచుంటి వెదకుచుంటి
కన్నతండ్రీ ! వేచియుంటి

నీదు వచనమును గనక
నీదు కౌగిలిని చనియక
నీదు పదతలము జేరక
నిలువనేరక వెదకుచుంటి
కన్నతండ్రీ! వేచియుంటి

'ప్రాణ మనోహరా' యని, 'అ
పార దుఃఖహరా' యనియు
'వే నను గనరారా' యని
వెదకుచుంటి వెదకుచుంటి
కన్నతండ్రీ! వేచియుంటి

# 22

నన్ను గొంపోవరాదా నాథా!
నా హృదయ నాథ!
తెన్నులేక దిక్కులేక
తిరిగెడు ఈ చెలువరిని
నన్ను గొంపోవరాదా!

కన్నుచూపు మేర దాటి
యే కడను దాగినాడవో
కన్నులు కాయలు కాచెను
కాంతా! నా ప్రాణకాంత!
నన్ను గొంపోవరాదా!

www.vaaradhionline.com

నడుపలేక నడువలేక
నడయాడితి నవసితి నే
బడలితి నొక యడుగైనను
పడదు నీ మృదు కరము నిచ్చి
నన్ను గొంపోవరాదా!

జీవిత వల్లీ ఫలమా!
చిరతర భాగ్యాలవాలమ!
జీవమణీ! దాసాశ్రిత
చిత్తరంజిత ప్రేమఖనీ!
నన్ను గొంపోవరాదా!

# 23

ప్రాణ రమణ !
దీనజన హృత్తాప హరణ !
మేను మరచి మొరలిడు ఈ
దీను స్వీకరించి ప్రోవు ప్రాణరమణ !

నీ యనుంగు బిడ్డ నని
నిన్నె విడచి పోవ గని
'నాయనా !' యని పిలువ, వినక
పోయితి, చెడి పోయితి ప్రాణరమణ !

ప్రాణనాథు జీవితేశు
ప్రవిమల ప్రేమ సుధాకరు
గానలేక, అయ్యో ! గ్రుడ్డి నై
పోయితి, చెడి పోయితి ప్రాణరమణ !

చెంతనుండి లాలింపగ
చెలి వై కౌగిట జేర్పగ
ఎంత పాపము ! నిన్ను వదలి
పోయితి, చెడిపోయితి ప్రాణరమణ !

ప్రోవ మిత్రు డెవడు లేక
ప్రోల రక్షకుండు లేక
పోవ దారిలేక యనద నై
పోయితి, చెడిపోయితి ప్రాణరమణ !

## 24

కనికర ముంచరా, కరుణాకర! తండ్రి!
అనదలము, తనయులము యాచించు చున్నాము
కనికర ముంచరా!

నేరము లెల్లను నీ మ్రోల వినిపింప
ద్వారము కడ వేచినారము, నీ భారము
కనికర ముంచరా!

కలగు హృదయములతో, కన్నీటి కాల్వలతో
పిలువ లే కున్నాము, విలపించుచున్నాము
కనికర ముంచరా!

హీనులమై నీచులమై, ఎంత చెడిన గాని
నీ నందనులమే, నిన్నె కోరితిమే
కనికర ముంచరా!

మలిన పంకము నుండి నలినము వలె నా
కలుష హృదయమున వెలిగింపు భక్తిని
కనికర ముంచరా!

## 25

త్రిరుగాడుచుంటి తండ్రీ: ఏ
తెన్నులేక తండ్రీ!
దుర్దాంత పాప ధ్వాంత సావృత దీర్ఘ కాళరాత్రి.

కనుగ్రుడ్డి నోయి తండ్రీ!
కనుపింపు మోయి తండ్రీ!
ముని మాన సాంబు జా తాంచిత బాను దివ్యదీప్తి

కరుణింపు మోయి తండ్రీ!
కురియింపు మోయి తండ్రీ!
దరహాస శుభ్ర జ్యో త్స్నామల శీత లామృతమ్ము.

# 26

ఎటుల నిలువగలను ? కటకటా !
శోక తమోవృత శూన్య లోకమున
ఎటుల నిలువగలను ?

కరుణాళుడు, భయహరుడు, మనోహరుడు
'వెర పేలా ?' యని నా కరము బట్టుకున్న
ఎటుల నిలువగలను ?

ప్రాణప్రదాత, నా బాగ్యవిధాత, నా
ప్రాణేశ్వరుడే నన్ పలుకరింపకున్న
ఎటుల నిలువగలను ?

పిలువలేను గదా ! విలపింతును గదా !
ఖలుడు వీడే యని కన్నెత్తి కనకున్న
ఎటుల నిలువగలను ?

అతడే ప్రియసఖు డతడే పెన్నిధి
అతడే నను తన యక్కున నిడకున్న
ఎటుల నిలువగలను ?

# 27

ఎంత కాలము నాదా ! దురంత చింత ?
చెంత చేరక ఇటుల వంత చీకట్ల దిరుగ
నెంత కాలము నాధా !

ఒక్క నిముసము వాసిన ఓ హృదయేశ !
ఒక్క పాపమ ? అయ్యో ! ఒక్క దుఃఖమ ? అయ్యో !
ఎంత కాలము నాధా !

ప్రాణదనము లేక ప్రాణేశ్వర !
ప్రేమదనము లేక పెన్నిధానము లేక
ఎంత కాలము నాదా !

చేసినాడను చాలదా నా జీవితేశ !
చేసి పాపము లెన్నో చివికి చివికినాడ
నెంత కాలము నాదా !

మనసు మనసున లేదురా ఓ మనోహరా !
వనట చెందెరా యెద కనరా కన్నీటి వాన
ఎంత కాలము నాధా !

# 28

వెరవకు హృదయమా! పరితాప మేలనే?
వెరవకు రమణుడు విడువనే వాలునే
వెరవకు హృదయమా!

ఘోర కాననమున కుందెద వది ఏలా?
దారి చూపెడు ప్రియుడు తడయునే ప్రోవక
వెరవకు హృదయమా!

గాఢ తిమిరమును గాంచి బెగడెదవే
మూఢవే? నాథుని ముఖచంద్రు గనవే
వెరవకు హృదయమా!

లోక మోహనకరుని శోకహరుని వరుని
ఏ కరణిని వదలి ఇటుల శుష్కించెదే
వెరవకు హృదయమా!

# 29

ఎంత దయయో తండ్రీ! ఈ పాపులపై
వంతల పోజిమ్మి కౌగిలింత చేర్చి లాలింతువు
ఎంత దయయో !

ఎన్నడో కూళలమై నిన్ను బాసి తిరిగి తిరిగి ఆ
పన్నులమై పరితపించు పాపులపై నీచులపై
ఎంత దయయో !

హృదయము లోపల నుండి సదయుడవై వారింపగ
బెదరులేక లజ్జలేక వినని కృతఘ్నులపై నీ
కెంత దయయో !

తనయులమని జాలిచెందెదో కనుగ్రుడ్డులమని యరసెదో
పనికిమాలినట్టి ఈ పలుగాకులపై మాపై
ఎంత దయయో !

దయను బ్రోచు తండ్రివి మా తల్లివి స్వామివి సఖుడవు
ప్రియుడవు కరుణాకరుడవు ప్రేమసుధాకరుడవు నీ
కెంత దయయో !

# 30

వ్రాలిన బాష్ప మౌక్తికమ్ము
మిలమిల నీ కసుల నిలువ
తళతళ మని తారలు నటియించునురా పాపీ!

వేడి వేడి నిట్టూర్పుల
వాడిన నీ పెదవు లదర
మోడు మ్రాకు చివురులతో మురియునురా పాపీ!

భరియింపగ రాని లజ్జ
శిరము వంగి క్రుంగి నంత
తెరల దాటి చందమామ నవ్వునురా పాపీ!

'దారి కానలేను స్వామి!
రారా' యని కంఠ మెత్త
గగన వీధి గంధర్వులు పాడుదురో పాపీ!

కురియుమురా కన్నీటిని
మరి మరి విలపింపుమురా
సరము కూర్చి పరమేశుడె తేల్చునురా పాపీ!

శిరము నెత్తి అరయునురా
చిరునవ్వుల చిలుకునురా
కరము చాపు కౌగిటికై కన్నతండ్రి పాపీ!

# 31

ఇదె వచ్చుచున్నాను ప్రాణనాదా!
  ఎంత వేచి యుంటివో, వేసారి యుంటివో
ఎంత నొచ్చికొంటివో ప్రాణనాదా! నీ
వెంత వంత నొందితో ప్రాణనాదా!

జలద భయద- గర్జనమ్ము
పెళ ఫెళ మన ఎడద వడకె
దివ్యగాన పరిమళములు
దెసల పర్వ తెలివి నొంది
    ఇదె వచ్చుచున్నాను ప్రాణనాదా!

ప్రళయ పవన దాటి కులికి
కలత నొంది మసలినాను
నింగి కెగయు వలపు టలల
పొంగి పొరలి పరువు లెత్తి
    ఇదె వచ్చుచున్నాను ప్రాణనాదా!

['మహతి'లో ఇచ్చిన పాఠం]

www.vaaradhionline.com

# ప్రధానసంకేతవివరణ

ఉ. = ఉచ్చారణభేదం (–భేదాలు)

కన్న. = కన్నడం

కో. = కోస్తాజిల్లా

క్రి. = క్రియాపదం

చూ. = చూడు

తమి. = తమిళం

తె. = తెలంగాణా

పర్యా. = పర్యాయపదం (–పదాలు)

రా. = రాయలసీమ

రూ. = రూపాంతరం (రూపాంతరాలు)

వి. = విశేష్యం

విశే. = విశేషణం

హిం. = హిందూస్తానీ

[ < > ] చారిత్రక నిష్పత్తి సూచనకు గుర్తు; మొనవైపున్న రూపం అర్వాచీనం (నిష్పన్నం) రెండో వైపున్నది ప్రాచీనం (మూలరూపం)

www.vaaradhionline.com

# 33

ఆనందసాగరుడు అరుగుదెంచె నేడు
ఆనందమాయె బ్రహ్మానందమాయె

కలుష హృదయు కొరకె కపట వర్తను కొరకె
మలిన మానసు కొరకె నా కొరకె నా కొరకె
ఆనందసాగరుడు -

అలుక పెడమో మిడడు ఖలుని దండింపడు
వలపు నవ్వుల తేనె విలుకుచు నా కొరకె
ఆనందసాగరుడు -

వెడగు చేతల నెంతో వేగించినను గాని
విడువక మసలక నా కొరకె నా కొరకె
ఆనందసాగరుడు -

వరదుడు పతిత పావనుడు ప్రాణేశుడు
పరువు పరువున ప్రభుడు నా కొరకె నా కొరకె
ఆనందసాగరుడు –

అమల వీక్షణముతో అభయ హస్తముతోడ
అమృత జీవన మొసగ నా కొరకె నా కొరకె
ఆనందసాగరుడు -

## 34

క్రనుల విచ్చి కనుడీ!
కను లలరగ కనుడీ!
మన మలరగ కనుడీ!

ఏటి పాప మయ్యా! ఇక
నేటి తాప మయ్యా!
సాటి లేనివాడు మన
స్వామి చల్లని వాడు
అది యేమొ వచ్చినాడు - కనుల విచ్చి కనుడీ.

మనవు లీయ వలదు, మీా
కనుల నీరు వలదు ;
కనుచు నుంద మతని మన
కన్ను లారగాను
తనివి తీరగాను - కనుల విచ్చి కనుడీ!

లోక మోహనకరుడు, భయ
శోకహరుడు వరుడు
రాక రాక నేడు మన
ప్రభుడు వచ్చినాడు
కడు వలచి వచ్చినాడు - కనుల విచ్చి కనుడీ!


www.vaaradhionline.com

మది దలంప లేరు, మున
మౌను లరయ లేరు ,
ఎదుట తోచినాడు మన
యెద హరించువాడు
అత డెంతొ అందగాడు – కనుల విచ్చి కనుడీ !

ఎట్టి పాపి నైన
ఎట్టి చెనటి నైన చే
పట్టి ప్రోచునంట ! అత
డెట్టి వాడొ కాని
అది ఎట్టి దయయొ కాని – కనుల విచ్చి కనుడీ !

www.vaaradhionline.com

## 35

రండు రండు ప్రాణేశుడు
రాక రాక వచ్చె నేడు
తెండు తెండు విలువ లేని
వలపు కానుకలన్ !

అడుగు దమ్ము లెంత వాడి
బడలెనో ! మెల మెల్ల వాని
కడుగుదమా చల్లని క
న్నీటి చినుకులన్ !

ఉల్ల మెంత కుందెనో ! మన
మెల్లరమును స్వామి మీద
చల్లుదమా విజయగీత
సౌరభమ్ములన్ !

కూడి జగము లన్నియు మన
తోడ నేడు పులకరింప
ఆడుదమా పాడుదమా
అతని కొలువున !

నిరతము మన కడనె యుండ
వరదు డెపుడు విశ్రమింప
పరచుదమా విమల హృదయ
మృదుల తల్పముల్ ?

వెరపు గొలుపు జీవితంపు
బరువు లెల్ల బాధ లెల్ల
మరచుదమా ! అతడు దివ్య
దర్శన మొసగ !

రండు రండు ప్రాణేశుడు
రాక రాక వచ్చె నేడు !

www.vaaradhionline.com

# 36

క్రోటి కంఠముల కూర్చి పాడుదము
సాటిలేని మన ప్రభు గూర్చి;
తరణికోటి జిత తేజునకు, శ్రిత
కల్పభూజునకు జయ్ జయ్ జయ్.

వివిధ ప్రాణులతో విశ్వ గానముతో
వేడుక కీర్తింతము ప్రభుని ,
వివిధ భువనచయ నిర్మాతకు, జన
హృద యాధినేతకు జయ్ జయ్ జయ్.

భక్తి పూర్ణ హృదయంబులతో
రక్తిగ కీర్తింతము ప్రభుని ,
భక్తరంజనున కష్టభంజనునకు
నిరంజనునకును జయ్ జయ్ జయ్.

బ్రాహ్మ సుదర్మ పతాకము పూని
భక్తితో తాండవ మాడుదము ,
బ్రాహ్మ సుధర్మ ప్రదాతకు మన
రాజేశ్వరునకు జయ్ జయ్ జయ్.

## 37

వెడలుదమా ! వెడలుదమా !
తడయక ఇప్పుడె వెడలుదమా !
విశ్వవిభుని పావన పదసరోజ
సౌరభముల మోదము గనగా !
వెడలుదమా !

క్రోలుదమా ! క్రోలుదమా !
షట్పదముల వలె క్రోలుదమా !
గురు కరు ణాకరు ప్రవిమల మధుర
ప్రేమ మరందము తమి తీర !
క్రోలుదమా !

ఆడుదమా ! ఆడుదమా ! ఆ
నంద చంద్రికల నాడుదమా !
ఆశ్రి తావను నపార దయాంబుధి
తరంగ మాలికలను చెలగి !
ఆడుదమా !

పాడుదమా ! పాడుదమా !
పక్షి గణము వలె పాడుదమా !
ప్రాణ నాదు మధు రానురాగ గీ
తికలను సోత్సవ కంఠముల
పాడుదమా !

# 38

ఆనంద మాయె బ్రహ్మానంద మాయె
 ఆనంద మానంద మానంద మాయె
ఆనం దాంబుధి భంగ మాలికాడోలికల
నాడించు నలరించు నాత్మేశుడు   ఆనంద-

మధుర మోహన మూర్తి ప్రాణేశుడు, ని
ర్మల తేజోమయ మూర్తి ప్రాణేశుడు
మధుర సుధారస మంజుల గీతికల
పాడించు పలికించు ప్రాణేశుడు   ఆనంద-

రమణీయ మూర్తి నా చిత్తేశుడు, అతి
కమనీయ కీర్తి నా చిత్తేశుడు
విమల ప్రేమార్ద్ర శీతల శుభ్ర చంద్రికల
చిలికించు వలపించు చిత్తేశుడు   ఆనంద-

నవ్య మోహన మూర్తి హృదయేశుడు, నవ
లావణ్యామల మూర్తి హృదయేశుడు
దివ్య ప్రశాంత సమీర వీచికలలో
తేలించు లాలించు హృదయేశుడు   ఆనంద-

# 39

జయము జ్ఞానప్రభాకరా !
  జయము శాంతిసుధాకరా !
జయము మోహతమోహరా !
జయ జయ కరుణాకరా ! జయము

శ్రిత జనగణ మందారమ !
సేవిత ముని హృద్భృంగమ !
పతిత త్రాణ కారణమా !
ప్రవిమ లానంద పూరమ ! జయము

బాను చంద్ర తారక గణ
భాస్వ దమల భూషణా !
సూన పల్లవ పత్ర శోభిత
సురభిత పూజిత చరణా ! జయము

శ్రావ్యరుత శకుంతగీత
జయస్తోత్ర పరితోషణ !
నవ్య ప్రకృతి రమణీయ సు
కావ్య మధుర పూరణా ! జయము

మానవ బాగ్యవిధాతా !
దీనసంఘ పరిత్రాతా !
ప్రాణి హృదయ రాజ్య నేతా !
బ్రాహ్మ సుధర్మ ప్రదాతా ! జయము

# 40

జయ్ జయ్ జయ్
జయ రాజేశ్వరా! ప్రభూ!
జయ్ జయ్ జయ్

జయ జయ సత్య స్వరూప!
జయ జయ జ్ఞాన ప్రదీప!
జయ అనంత కల్యాణాం
చిత మోహన మణి కలాప!
జయ్ జయ్ జయ్

పరమభక్త జీవిత మృదు
ప్రసవమాలి కాభరణా!
నిరుపమ మధుర ప్రణయా
నంద సుధా శీతకిరణ!
జయ్ జయ్ జయ్

శ్రిత మునిగణ చిత్త వికస
స్వర సుమ మధుకరమూర్తీ!
శత సహస్ర భానుకోటి
నిభ తేజో దివ్యకీర్తి!
జయ్ జయ్ జయ్

వికృతపాప భయదతాప
ఘన జలద ప్రభంజనా !
సకల ప్రాణి హృదయదుఃఖ
సాంద్రవనీ హుతాశనా !
జయ్ జయ్ జయ్

ప్రియభారత జనయిత్రీ
నిత్యభాగ్య శుభవిధాత !
ప్రియతమ నిర్మల విశాల
బ్రాహ్మసుధర్మ ప్రదాత !
జయ్ జయ్ జయ్

www.vaaradhionline.com

# 41

ఆహాహా !

పొంగి పొరలు నానంద మ్మెదలో

ఆహాహా -

శుభవాసర మిది శుభసమయ మ్మిది
ప్రభుని ప్రేమసౌరభము కడల విరియ

ఆహాహా -

ఇరుల దరుమ నెల్లెడల మెరయ భా
సుర దివ్యప్రభ వెలయు నీశుని కరుణ

ఆహాహా -

అమృత మీాయ దాహమ్ము తీర్పగా
విమల మందాకిని వెలయు నీశుని కరుణ

ఆహాహా -

ఫలరసమ్ముల గూర్ప చలువనీడల జేర్ప
విలసిత కల్పము వెలయు నీశుని కరుణ

ఆహాహా -

41-44 గీతాలు 'ఆంధ్ర బ్రాహ్మగీతాంజలి' (1968) లో మాత్రం ప్రచురితములు


www.vaaradhionline.com

# 42

రారే మా రని అనురా గాలోకము తెరచి
రాజరాజేంద్రా పిలిచితివో !
తారక లెల్ల యాత్రావీది బడి కలగి
తరళించి నటియించి దరిజేర తెరలెను

రారా మా రని అనురాగ హాసము కురిసి
రాజరాజేంద్రా పిలిచితివో !
విరు లెల్ల పయనపుం దెరువున పరవశత
వికసించి వాసించి వెడలెనో నీ కొరకై

రావా నీ వని కరుణా రాగ శీతల రావ
మదర నా స్వామీ పిలిచితివో !
సిగ్గో భయమొ మరపొ చెదరెనో హృదయము
కఠిన పాషాణమై కదలదే పదము !

అపుడు చివురు పెదవు లదర నిట్టూరుపు
స్వామీ నా స్వామీ విడిచితివో !
అపుడు చెదరి అడలు అశ్రు వీక్షణముతో
అయ్యో నాకై అరసితివో !

ఏదో దుఃఖమై అంత ఎంత ఏడ్చితినో !
ఈ ఎడారి బ్రతుకు ఏమో ఎందులకో !

# 43

విసరి వేయుము నేడు తారా
  విసర మాశాంతముల కొసలకు !
మసలకే వెంచేయునే, నా
మనోహర సంపూర్ణచంద్రుడు !

చిర వియోగిని ఈ నిశీధిని
ఇరుల బరువుల బ్రతుకు నేడు
మెరసి పోవునె నిలువు నిలువున !
విరిసి పోవునె జల్లు జల్లున ॥

చంద్రకాంత శిలాతికర్కశ
సాలబంజిక, దాసి, నేడు
కరగి పోవునె నిలువు నిలువున !
పొరలి పారునె జల్లు జల్లున ॥

ఆరలేని పిపాస నలగు చ
కోర విరహిణి, దాసి, నేడు
బ్రతికి పోవునె నిలువు నిలువున !
పరువు లిడునే జల్లు జల్లున ॥

# 44

రండు మన జీవితముల కోరుచున్నది
బ్రాహ్మధర్మము సకల ధర్మరాజము
బ్రాహ్మధర్మము మన బ్రాహ్మధర్మము రండు —

ప్రభుని ప్రాపు జేరి ధర్మోత్సాహ మూనుడు
రక్షకు డతడే జీవన వల్లభు డతడే
నాయకు డతడే మన సర్వ మాతడే రండు —

ముందు వెనుక లెన్ని యెన్ని మురియు చుందురే
సందియ మేలా బాలు జంకెద రేలా
శౌర్యము లేదా విశ్వాసము లేదా రండు —

మహిత బ్రాహ్మధర్మ యోధుల కార్యశూరుల
మాన్యచరితుల, అయ్యో, మరచిపోయిరే
మరచిపోయిరే మన బ్రాహ్మవీరుల రండు —

# మ హా తి

'మహతి' మొదట 1949 లో గుంటూరు ప్రార్థనా సమాజం ప్రకటించింది. అంతకు ముందే, 1938లో, 'మహతి నుండి' అని ఒక 'గీతావళి' రాజమండ్రీ ప్రార్థన సమాజం ప్రచురించింది. అవి రెండూ ఇప్పుడు అలభ్యం. అసలు, చివర చేర్చిన 'పద్యావళి' కాక, 67 భక్తిగీతాల సంపుటం 'మహతి' 'కన్నీరు' కీర్తనలు (21-40) ఇరవయ్యీ, 'మంగళ కాహళి'లో చేర్చిన మరో అయిదూ మినహాయిస్తే, అవి 42 తేలాయి. రెండు పాటల(83, 86)కు సరసనే కొత్త పాఠాలు ఇవ్వబడ్డాయి.

www.vaaradhionline.com

# 45

ఎటుల నే నీ లీల కీర్తింతు !
 ఓ దేవ దేవా !
ఎటుల నే నీ మ్రోల నర్తింతు !

కటకటా ! నిను తలచి తలచి
కదల లేదే కంఠ రవము !

కోటి సూర్యుల కాంతిలో, ఆ
రాట మెరుగని శాంతిలో
మాటి మాటికి మసలి మను ఆ
మహతినా ! భారతీ సతినా ! ఎటుల . .

ఇపుడు వెలుగో, అపుడు పిలుపో,
ఎపుడు మౌన నిశీధ బారమె !
ఉపశమింపని తపనయే నా
కున్న భాగ్యము కన్న తండ్రీ ! ఎటుల . .

# 46

ఈ సుధర్మ భవనములో ఈరేడు జగాల నేలు
ఈశ్వరుడే దీనజనహృదీశ్వరుడే కొలువు తీర్చు

దశదిశలే నింగి నేల నిశా దివము లిందు జేరి
కలసిపోవు కలగిపోవు పులకరించునో!
ఈ సుధర్మ భవనములో

మణిమోహన నవకాంచన మండిత కోటీరకోటి
మసృణారుణ కిరణావళి మలసి కౌగిలించునో
ఈ దరిద్ర తృణోన్నిద్ర హృదయామోదము నిందు
ఈశ్వరుడే దీనజన హృదీశ్వరుడే కొలువు తీర్చు!
ఈ సుధర్మ భవనములో

లేవు కుటిల శృంఖలములు లేవు కఠిన కుడ్యములే
చెరలు లేవు ఇరులు లేవు కరుణాలయ మిందు
అమృత కౌముదీ మధుమిళి తానందమె ఆనందమె
ఈశ్వరుడే దీనజన హృదీశ్వరుడే కొలువు తీర్చు!
ఈ సుధర్మ భవనములో

పరువు పరువున రండో!
ప్రేమార్ద్రులై కాంతి దామాంతరమునకు
పరువు పరువున రండో!

తెరచికొన్నది స్వామి విరితావి కౌగిలి
విరిసి కొన్నది కరుణ గురియు చల్లని చూపు
వెర పేల?
ననుబోలు పతితులో పేదలో! పరువు..

ఎలు గెత్తి కే లెత్తి ఇదె పిలుచుచున్నాడు
కలకాలమై మనకయి వేచియున్నాడు
నిలుతురే
ననుబోలు పతితులో పేదలో! పరువు..

అడు గడుగున జగతి జలుజల్లు మని ఆడ
అడు గడుగున చదలు జయజయ మని పాడ
తడ వేల?
ననుబోలు పతితులో పేదలో! పరువు..

తళుకు బాగ్యము వీడి పరువు బిరుదులు వీడి
తులలేని తుదిలేని పదవి దారిని బట్టి
కదలి అధ
మాధములై పతితులో పేదలో! పరువు..

## 48

వినవో !
ప్రాణేశు ప్రణయోత్స వాహ్వానము !

మంద మంద శీత మధు రానిల తరంగ
మందు తూగాడు ఆనంద సందేశము
వినవో !

స్వాదు విహంగమ సంగీత ర సాపగా
మోద కలకల మందు మొరయు సామగీతి
వినవో !

దరవికస్వర నవ సౌందర్య ప్రవిలసితము
అరుణ రాగములోన విరిసెడు వేదోక్తి
వినవో !

ఎదలో ఉప్పొంగి ఎల్లెడల పొరలి పారి
చదలె పొడిచి ముంచు శ్రావ్య ప్రణవ రవము
వినవో !

www.vaaradhionline.com

## 49

తెల్లవారదోయి, నిదురలో లేదోయి సుగతి!
చూడవా, కను విచ్చి చూడవా, జగతి!

సద్దు చేయక రేయి సాగిపోయినది;
ప్రొద్దు చీకటి తెరల పొంచి చూచినది;
మిద్దె లోపలి దివ్వె మింటి కెక్కినది - లేదోయి..

చెట్టు చెట్టున లేత చివురు పుట్టినది;
పూవు పూవున కమ్మ తావి పట్టినది;
తేటి తేటికి తేనెపాట ముట్టినది - లేదోయి..

ఏడు కడలులు వెల్లు టేటిలో కలిసె;
ఏడు గాలులు వాడవాడలను మలసె,
ఏడేడు లోకమ్ము లేకమై వెలసె - లేదోయి..

అన్నదమ్ములు చేతు లందు కొన్నారు,
ఆలు బిడ్డలు తోడునీడ లైనారు,
ప్రాణు లందరు గూడ పథికు లైనారు - లేదోయి..

మింటిపై బురుజుపై గంట మ్రోగినది;
కొండపై కోనపై జెండా ఊగినది,
గుండెగుండెకు పిల్పు కొసరి సాగినది - లేదోయి..

కోట తల్పులు విడగ మీటినా రోయి,
కోట లోపల కొలువు కూర్చినా రోయి,
కోటలో కొలువులో మేటి రారాజై
వేయి చేతులు సాచి వెలుగుచున్నాడు,
పేరు పేరున నిన్ను పిలుచుచున్నాడు - లేదోయి..

(వేంకట పార్వతీశ్వర కవుల 'ఉదయగానము' చదివి)

www.vaaradhionline.com

# 50

త్రోలి ప్రొద్దు కొండపై మొలిచె నొక దేవళము
వెలుగు గుడి మొగసాల నిలిచె యాత్రాజనము

కోన కోనల గాలి కొన లూర్చె నానందము
కోనేటిలో తమ్మి క్రుమ్మరించె మరందము

ఆలయమ్మున గంట అందించె నాహ్వానము
ఆలకించిన పికము లాలపించెను ప్రణవము

గుడిని శంఖము మొరసె, విడెను వాకిటి ద్వారము
ఎడద యెడదను నిండె గుడినుండి మా దైవము

www.vaavaadu.com

# 51

హరినామ గాన మధుపానమే వినా
వర మేది మనకు సోదరులారా!
బ్రతు కారునే కరవు దీరునే! భవ
పాప తాప బంధములు జారునే!

విరితేనె కాదు, పలరసము కాదు, సుర
వరులె క్రోలు సుద కాదు, కాదు!
జర రాదు ఏ వెరపు రాదు రాదు,
మరణమ్మె రాదు సోదరులార!

హరినామ..

నిరుపేద వేమొ! భూనేత వేమొ! సం
తాపి వేమొ! సన్యాసి వేమొ!
నరకమ్ము నుండి గగనమ్మె నిండి
భువనాలు ముంచు సోదరులార!

హరినామ..

పరు వెల్ల విడిన గరువమ్ము సెడిన
తడవేల యింక హరినామ గానమె!
విడరాని శాంతి చెడిపోని కాంతి
గడియించు మనకు హరినామ గానమె!

హరినామ..

# 52

మధుర నామం బెవరు వినిచిరో
మరగి నిముసము వదల లేను !
అధమ జీవిక కెటుల దొరకెనో
అంతు లేని అమూల్య భాగ్యము !

మెలకువను మే మరచు నిద్దుర
మెరయు పవళుల మొరగు రాత్రుల
వెలుగుగా నెలమల్లె కలగా
వేయి విధముల విరిసిపోయెడు
మధుర నామం బెవరు వినిచిరో !

దారి పొడుగున పాటగా, నా
ధైర్య బలముల ఊటగా, నా
ఊతగా, విడరాని చెలిగా,
ఉచ్ఛ శాంతిగ, దీప కాంతిగ
మధుర నామం బెవరు వినిచిరో !

తలపు లోపల తళుకుగా, నా
పలుకులో పరమార్ధముగ, నా
పనుల లోపల పటిమగా, విడి
వడని దీక్షగ, రక్షగా
మధుర నామం బెవరు వినిచిరో !

## 53

దరిద్రనారాయణ లోకేశా!
దయాపరాయణ ప్రాణేశా!
నిరంత రాశ్రయ మీవే కావా!
నిరామ యామృత మీవే కావా!

విశీర్ణ వసనధరా లోకేశా!
వికీర్ణ తిమిరహరా ప్రాణేశా!
ప్రశాంత జీవిక వీవే కావా!
నిశాంత దీపిక వీవే కావా!

పరాగభరి తాంగా లోకేశా!
విరాగపద సంగా ప్రాణేశా!
పురాణ మిత్రమ మీవే కావా!
నిరంజ నాత్మవు నీవే కావా!

విశాల నవభారత లోకేశా!
విశేష దీనాశ్రిత ప్రాణేశా!
అశేష భాగ్యమ వీవే కావా!
అనంత శక్తివి నీవే కావా!

## 54

అడుగులే అందునా?
అమృత జీవనధనా!
అడుగులే అందునా?

యోగీంద్రుడను గాను
త్యాగశీలుడ గాను
ఏ గుణములేని నా
కేలాగు దొరకునో!
అడుగులే అందునా?

బ్రతుకు చీకటి కొసల
ప్రాబాతపు దెసల
తరణి బింబమ్ములై
దగదగా మెరయు ఆ
అడుగులే అందునా?

అందుకొను దాక నా
ఆశనే వదలుదున!
అందుకొని నంత బ్రతు
కంటగా నదుమనా!
అడుగులే అందునా?

www.vaagdhionline.com

## 55

ఏ చోట దాచితివో ఈ చైత్ర జీవమ్ము
ఇన్నాళ్ళు మా కనుచు దేవా!
ఈ చీకు హృదయాలు వేచి కననే లేవు
నీ చిత్రములు దేవదేవా!

ఏ నీలి పందిళ్ళ, ఏ నిదుర పొదిగిళ్ళ
ఈ తార లలసెనో దేవా!
నీ నందనమ్ములో నేటి అర్చనములో
పూవులై విరిసె నో దేవా!

ఏ సీతు కాలాన, ఏ మంచు నునుసోన
గళములో కునికె నో దేవా!
నీ వసంతమ్ములో నేటి కీర్తనములో
పికములై పలికె నో దేవా!

ఇక హిమర్తువు వలదు! ఇక నిశీధము వలదు!
నీ సన్నిదియె దేవదేవా!
ఒక వసంతముపైన, ఒక ప్రభాతము లోన
వికసింప జేయవా దేవా!

## 56

క్రదలి నడువగలము మేము
బెదరి తిరిగిరాము మేము
చదలు కడలి కలియుకడ నీ
పదములు వికసించు ప్రొద్దు
పదములు వాసించు ప్రొద్దు

ఇరుల రేలో కరకు రాలో
దరియె లేని అడవిపాలో
దొరకని నీ గోరు కొసల
కురియు నంట మధుర మధువు
పొరలు నంట అమృత మధువు

గళములోన నొకటె గీతి
కనుల మ్రోల నొకటె జ్యోతి
కరు ణాలయమునకు నరుగ
తిరుగరాని దొకటె తెరువు
దెసలె దాటి ఒకటె తెరువు

కాలమే ఉన్నంతవరకు
గానమే ఉన్నంతవరకు
అడుగులు నీ వంటు వరకు
తడయ బోము నిదుర బోము
అడలి పోము అలసి పోము.

# 57

దూరాదూరా నైన ద్వారతోరణ మైన
తోచదే నా మ్రోల దేవదేవా!
దారిలోనే అలసి దూళిలోనే సొలసి
తడసి ఏ మూదునో, దేవదేవా!

వన్నెవన్నెల ధూళిచిన్నె లన్నీ జాలి
బ్రతుకంత నంటె నో దేవదేవా!
మన్నుమిన్నులు కలసికొన్న ఆ చో టేదొ
ఎన్నాళ్ల కందునో, దేవదేవా!

ఇంత తెలియని యాత్ర ఇంత కాల్చె ఆత్ర
మెంత కాలమొ నాకు దేవదేవా!
అంతరమ్మున శాంతి అంతటా నీ కాంతి
అలరింప చేయవా, దేవదేవా!

# 58

నా నోట నీ మాట గానమయ్యే వేళ
నా గుండె నీ వుండి మ్రోగింపవా వీణ?
రాగ మెరుగని వీణ, రక్తి నెరుగని వీణ
తీగపై నీ చేయి తీయకే గడెయేని!

అంతరాంతరము నీ అమృత వీణే యైన
మాట కీర్తన మౌను, మనికి నర్తన మౌను !
ఈ అనంత పదాన ఏ చోటి కా చోటు
నీ ఆలయ మ్మౌను, నీ ఓలగ మ్మౌను!

అడు గడుగునకు స్వామి అడుగు సవ్వడి వినిన
ఎడద లోలోన ఎల్లెడల విశ్వము లోన
ఈ యాత్ర ముగియునో ఏ వేల దిగుదునో,
హాయిగా చల్లగా సాగిపోవుదు నంతె!

దేవదేవా ! మహాదేవ! లోకేశ్వరా !
దీనబంధూ! దయాసింధు ! ప్రాణేశ్వరా !
గడెయేని నీ వియోగము సహింపగలేను
విడిపోని నీ చెల్మివిధ మేమొ సెలవిమ్మ!

# 59

నా కేల ఒక జోలె,
నాలో అమృత వీణ
ఉంచి నను లె మ్మందువా !
దేవ
ఊరకే పొమ్మందువా !
నాలుగూ దిక్కులా
నడిమి స్వర్గమ్ములో
ప్రతి యింటి మోసాల ఆగనా !
దేవ
ప్రతి గుండె మోసాల ప్రోగనా !

www.vaaradhionline.com

పాడి పాడీ, నృత్య
మాడి ఆడీ, నిన్ను
వేడి వేడీ పొరలనా !
ప్రతి గుండె
తోడ కూడీ తరలనా !
నాలుగూ దిక్కులా
నడిమి స్వర్గ మ్మంత
గంధర్వ సీమగా చేయనా !
దేవ
గాన సౌధమ్ముగా చేయనా !

విరిసి విరిసీ, తేనె
కురిసి కురిసీ దెసల
దరిసి దరిసీ పొరలనా !
ప్రతి గుండె
నొరసి యొరసీ తరలనా !
నాలుగూ దిక్కులా
నడిమి స్వర్గ మ్మంత
పూల పందిరి చేయనా !
దేవ
బృందావనము చేయనా !

తేలి తేలీ, అలల
తూలి తూలీ, చదల
సోలి సోలీ పొరలనా !
ప్రతి గుండె
మాల లల్లీ తరలనా !
నాలుగూ దిక్కులా
నడిమి స్వర్గ మ్మంత
పాల కడలిగ చేయనా !
దేవ
పండు పున్నమి చేయనా !



www.vaaradhionline.com

తలపు తలపూ జ్యోతి,
పలుకు పలుకూ గీతి,
పను లన్ని ప్రణయముగ చేయనా!
దేవ!
ప్రతి గుండె నీ గాధ పాయనా!
నాలుగూ దిక్కులా
నడిమి స్వర్గ మ్మంత
మూల మూలల నడతునా
నా దేవ
వేల వేలల విడుతునా?

న న్నొక్క జోలెగా,
న న్నమృత వీణగా
తడయ కిక రమ్మందువా!
ప్రతి గుండె
విడియగా తెమ్మందువా!
నాలుగూ దిక్కులా
నడిమి స్వర్గమ్ముతో
గంగలా కడలిలో దూకనా!
దేవ
పొంగుతూ అడుగులా తాకనా!


www.vaddadionline.com

# 60

కాలు కదపని రాయి సోలి నిలిచిన రాయి
కదలి నడిచిన దోయి నీ బాట !
కడిమి నాడిన దోయి నీ బాట !

వాడి పోయిన తీగ మోడు వారిన తీగ
పరిమళించిన దోయి నీ తోట !
విరిసి మురిసిన దోయి నీ తోట !

తీగ లెరుగని వీణ మూగ వోయిన వీణ
తీయగా పాడినది నీ కేల !
వా యెత్తి పలికినది నీ కేల !

కనులు విప్పని గూబ కటికి చీకటి గూబ
కనులార కాంచినది నీ లీల !
తనివార మెచ్చినది నీ లీల !

విశ్వ మెరిగిన జ్ఞాని విభుని జూచిన మౌని
వేద మని నా డోయి ఈ మాట !
వేచి కని నా డోయి ఈ మాట !

నగము క్రుళ్ళిన పాపి సొగసి క్రెళ్ళిన తాపి
సత్య మని నా డోయి ఆ మాట !
నిత్య మని నా డోయి ఆ మాట !

# 61

నేడే రమ్ము! నేడే రమ్ము!
వాడిన ఈ సుమము గోయ!
నేల వాలి పోవునా! పెం
ధూళి కౌగిలే జౌనా!

విసరు గాలి తొందరలో
వేసవి నిశ్వాసములో
మసల కోయి! ఈ నిముసము
కొసనె గాదె మనుగడ! నేడే రమ్ము

ముసరు రేయి తొలి చీకటి
మసక మసకలే అలమునొ
మసల కోయి! నీ పూజా
మంగళ సమయమె పోవునా! నేడే రమ్ము

మసృణ శ్రీ గళ మాలిక
మలసి నిలుచునో లేదో
మసల కోయి! మధువు లేల!
మధుర పరిమళము లేల! నేడే రమ్ము

కొస గోరుల తురుమ వేమొ
కూర్పవొ బాధా భాగ్యము
మసల కోయి! మసల కోయి!
మన్నింపవొ జాలి మనవి! నేడే రమ్ము

(రవీంద్ర కవిదేవుని గీతము చదివి)

## 62

పడవ నడుపుము కర్ణధారి !
కడిమి విడువక కడలి మీరి !

సుడులు తిరిగే పడవ, అడరిపోయే పడవ,
తడసి రానేలేక తల్లడిల్లే పడవ
పడవ నడుపుము కర్ణధారి !

సొగసి మునిగే పడవ, ఎగసి ఆడే పడవ,
సొగసుగా హంసగా సురిగిపోయే పడవ
పడవ నడుపుము కర్ణధారి !

రేవువై, నిలుచు చుక్కానివై, చుక్కవై,
బావి కా లానుకూ లానంద వాయువై
పడవ నడుపుము కర్ణదారి !



www.vaaradhionline.com

## 63

ప్రాణరమణ! కరుణాభయచరణ!
మౌనిజన హృదయ గగన సంచరణ!
అధమ జీవన ఘన తిమిర సంహరణ!
మధుర మధుర దరహాస ప్రసరణ!

తరుణ తరణి కిర ణోజ్జ్వల భూషణ!
తరళ శిశిర సుధా కిరణ నిరీక్షణ!

www.vaaradhionline.com

## 64

ప్రాణరమణ ! కరుణాచరణ!
శ్రితయాచక శోకహరణ!
నవవిభాత కిరణ కంకణ !

ప్రాణరమణ'

దిశదిశాం తాగత శకుంత
దివ్యగాన సంతోషణ !
మౌని విమలహృదయ గగన
పద విశాల పథ విహరణ !

ప్రాణరమణ!

పవన చలిత పక్షాంచల
పరిమళ సందేశహరణ !
ప్రణయ పూర్ణానంద వికచ
నవజీవరస ప్రసరణ !

ప్రాణరమణ !

మానవ మంగళ విధాన !
మామక నిర్వాణ తరణ !
భారతావనీ పురాణ
మహితాశయ పరిపూరణ !

ప్రాణరమణ!

www.vedantamonline.com

## 65

వాడిన తీగెకె గడియ గడియ కొ౯క
 వసంతకాలము దేవా !
మాడిపోవు నెండకారు నేలకె
మధుర వర్ష మో దేవా !

దారిగాని దారిని అడుగున కొ౯క
తారాదీపము దేవా !
పార బోసికొన్న పానపాత్రలో
తేనెసోన లో దేవా !

ఈ విశ్వాసము వీడని వారికి
భావిస్వర్గ మో దేవా !
ఈ ఆశా సందేశము చాటెద
మాశాశల నో దేవా !

(బసవరాజు అప్పారావుగారి పాట చదివి)

# 66

శ్రావణ మోహన శ్యామల జలధర
స్వామీ! నీ శుభ సందర్శనమున
చిర విరహానల శీర్ణ మీ హృదయము
పురి విరిసికొనునో! పులకరించునో!

తరుణ తమాల పల్లవ నీల లావణ్య
శిశిర శిశిర సుధా నిబి డాశ్లేషమున
చంచల చంచలా వ్రతతీ యువతినై
మెరసి పోదునో! విరిసి పోదునో!

ధవళ బలాకా సుందరతర మృదు సుమ
తరళ తరళ హారధారీ! హారీ!
శిథిల పత్రాగ్ర జీవితము నీ గళసీమ
పరిమళించునో! పరువ మొందునో!

మందర గంభీర మధుర కంఠస్వర
మంద మంద సంగీత మందాకిని
మౌన మలిన మీ ముగ్ధ గీతా రవము
కలిసి పోవునో! కరగి పోవునో!

పురి విచ్చుదునా నేను! మెరసిపోదునా నేను!
పరిమళింతునా నేను! కరగి పోదునా నేను!
అజ్ఞాత హేమం తాభీల ప్రవాసమున
కృశియింతునో నేను! నశియింతునో నేను!

## 67

ఎంత కాలము వేచియుందును
ఎంత భారము మోసి కొందును
ఇంత దవ్వై నీకు నా స్వామీ !
రే బవలు న న్నీ
చింతయే దహియించు నా స్వామీ!

బ్రతుకు బ్రతు కంతయును కన్నుల
పడి చలించుచు ఎదురు చూచును
ఈ నిశాగ్నులు చెదర రావోయీ !
నా నాధ ! నాకయి
ఇంక నైనా కదలి రావోయీ !

తళుకు తారక లెందు కోయీ !
కలలు కోరిక లొల్ల నోయీ !
ఈవుగా కే ఆశ లనలములు
ప్రాణేశ్వరా ! నా
కీవుగా కే వరము దుర్భరము !

మౌని మస్తక భూషణమ్ములు
దీనశోక విదారణమ్ములు
ఏరి కందని దివ్య భాగ్యములు
హృదయేశ్వరా ! నీ
గోరు కొసలే నాకు ప్రాణములు !

# 68

ఏ దారి కలదోయీ ! ఇం
కే సుఖ మున్న దోయీ !
ఈ దీన పదికున కో హృదయేశా ! హృదయేశా !

ఎడలేని పయనమున ఏ వెలుగో, ఏ పిలుపో !
కడల చీకటి చిచ్చె ! ఎడద చీకటి చిచ్చె !

తగని మౌన బాధ ! దారుణ భారము !
సొగసి ఈ బ్రతు కొక్క అడుగేని ఇడలేదు !

నీ రాక కే తగనో ! నీవే ఎదురు రావో !
ఈ రేయి ఈ ధూళి నేమో ! ఏ మోదునో !

# 69

క్రాంచలేను కాంచలేను
కనులు మూతవడును దేవ !
మించుతీగ లెన్నెన్నో మించి మెరయుదోయి దేవ !
కించుతనపు నా బ్రతు కిది : కాంచలేను నీ తేజము !

నిలువలేను నిలువలేను
కలగి అడుగు తూలు దేవ !
నీ పాదము అందరాని నింగి నిలుచునోయి దేవ !
ఓపని కూపము బ్రతు కిది నిలువ లేను నీ సన్నిధి–

పలుక లేను పలుక లేను
భయము సిగ్గు వొడము దేవ !
అలయని దయ నాయందే నిలిపి వదలవోయి దేవ !
మలిన మలిన మీా బ్రతు కిది పలుకలేను
నీ నామము.

(బసవరాజు అప్పారావుగారి పాట చదివి)

తుదిలేని యాత్ర ఇది ఎటులు సాగింతునో
కదలనే లేనోయి దేవా! దేవా!
పదము లీవే ఇమ్ము! పథము లీవే ఇమ్ము!
పడివత్తు నీ కడకు దేవా! దేవా!

తెలుపు మాటే లేక వలపు పాటే లేక
తెరువు బరువై పోద దేవా! దేవా!
తెలివి నీవే ఇమ్ము! పలుకు నీవే ఇమ్ము!
పలుకరింతును నిన్ను దేవా! దేవా!

మలయు చూపులు లేక మసలు దీపము లేక
నిలిచిపోదా దారి దేవా! దేవా!
కనులు నీవే ఇమ్ము! కాంతి నీవే ఇమ్ము!
కనులార నిను కాంతు దేవా! దేవా!

చిరిగిపోయిన జోలె నిరుపేద జీవితము
శ్రీ పాదముల నిడగ దేవా! దేవా!
వరము లీవే ఇమ్ము! వరము లీవే కొమ్ము!
కరవు దీరును నాకు దేవా! దేవా!

దాసిగా నుండుట కైన
తగనా, ప్రాణేశ, దేవ!
నీ సేవకే గాక నా కీ
నీరస జీవిత మేల?

నీ పూజకై పూల వనమే
నిర్మింతు నో దేవదేవా!
నా దోయిలితోనె నేనే
నా ప్రేమ జీవనము పోసి -

నీ రాకకై పూలదారి
నే పరతునో దేవదేవా!
నా అంగుళితోనె నేనే
నా హృదయ పత్రముల త్రుంచి -

నీ కొలువుకై పూల పీరి
నే కూర్తునో దేవదేవా!
నా కరములతోనె నేనే
నా బ్రతుకె నీరాజనం బిడి -

నీ హాయికై పూలపాట
నే నేర్తునో దేవ దేవా !
నా కంఠముతోనె నేనే
నా జీవమే పాడి పాడి—

నీ ఆనయా? నీ దాసినై
నే చనుదు నో దేవ దేవా !
నీ కోర్కెయా? నీ దాసినై
నే మనుదు నో దేవ దేవా !

www.vaaradhionline.com

ఈ గడ్డి పూవులే ఈ దారి పొంతనే
అలసిపోనీవోయి దేవా! దేవా!
నీ ఇష్టమైనచో నీ పూలదండలో
మెరసిపోనీవోయి దేవా! దేవా!

ఈ లేత గీతాల ఈ గూటి మూలనే
మూగవోనీవోయి దేవా! దేవా!
నీ ఇష్టమైనచో నీ కీర్తనమ్ములో
మ్రోగిపోనీవోయి దేవా! దేవా!

ఈ చిన్ని సెలయేళ్ళ ఈ కొండ కోననే
ఎండిపోనీవోయి దేవా! దేవా!
నీ ఇష్టమైనచో నీ ప్రేమ రాశిలో
నిండిపోనీవోయి దేవా! దేవా!

ఈ పేద జీవికల ఈ ఎడారులలోనె
వేగిపోనీవోయి దేవా! దేవా!
నీ ఇష్టమైనచో నీ రాజవీథిలో
సాగి పోనీవోయి దేవా! దేవా!

## 73

ఒకసారి రావా ! దేవా !
ఒక నిముసమే నేను ఇక నిలువనే లేను !
ఒకసారి రావా ! దేవా !

ఏ సుఖ మేనియు లేక ఎండి పోయెను బ్రతుకు
జాలివాన చలువజల్లుగా నొకసారి !
ఒకసారి రావా ! దేవా !

ఏ మాధురియు లేక ఏలాగు మనగలనో
తీయ తేనియ పాట తేటగా నొకసారి !
ఒకసారి రావా ! దేవా !

మరుగు చీకటి లోక మనలమై దహియించు
శాంత శారద పూర్ణచంద్రుడవై ఒకసారి !
ఒకసారి రావా ! దేవా !

పగ లనక రే యనక పడియుండి పడియుండి
పగము నశియించాను స్వామి నీకై నేను !
ఒకసారి రావా ! దేవా !

నీ అడుగు దోయిలో నిర్జ రామృత మధువు
నిండి పొరలు నంట దేవా!
నిరుపేదలకు నేని కరకు పాపుల కేని
దొరకు నంటా రయ్యా దేవా!

చీక టింటిలోన చీకు సంకెళ్ళలో
చివికిపోయా నయ్యా దేవా!
చావొ బ్రతుకో తెలియజాల నీ మనుగడకు
చాల నలగితి నయ్యా దేవా!

ఎవరు కావలె నందు రే విలువ లేని దిది
ఏకాకి బ్రతు కయ్యా దేవా!
'తవిలి విడువదు స్వామి దయ' అన్న వేదమే
తల దాల్చు కొన్నాను దేవా!

అడగు శిలనై నాలు గడుగు లేనియు నేను
నడచి రాలే నయ్యా దేవా!
అడుగు లందిచ్చెదవొ అమృత మందిచ్చెదవొ
ఆశ విడలే నయ్యా దేవా!

# 75

నీ అడుగులే కాక నిరుపేద బ్రతుకునకు
ఏ ఏడుగడ కలదురా! స్వామీ!
ఏ ఆశ్రయము లేక ఏ ఆశయే లేక
ఏ కరణి చలియించురా స్వామీ!

వాడ వాడల తిరిగి జాడ లన్నిట నరిగి
వాడి సగము నశించెరా! స్వామీ!
నీ ద్వారమే చేరి నీ పదరజమె కోరి
నేటి కిట చలియించురా! స్వామీ!

హిమ విమల కణ మౌనా! సుమ సురభి దళ మౌనా!
ఏమి గతి? కరుణింతువో! స్వామీ!
ప్రాభాత సమయమో! పాదార్చ నోత్సవమొ!
బ్రతుకంత చలియించురా! స్వామీ!

# 76

నీ కోరిక ఎపుడో నాడె
నా కొరకై వత్తు గాని
నా కలవరింతల విని
నవయకు మో నాథా!

ఏ కాలాంతమున కేని
ఎదురు చూచి నిదురింపని
నా కన్నుల కరవు దీర
ఏ కలలో! ఏలో!

వెను తిరుగను విసివికోను,
వేసారని అడుగులతో
మను నంతకు నా తెరువున
మసలక పరతెంతును!

నా ప్రాణము కొరకు, నా అ
నంత భాగ్యమూర్తి కొరకు
నలిగి ఏడ్చు నా ఎద కే
నవ నిధులో! ఏలో?

ఆస బాసి, కుమిలి, వి
శ్వాసము విడి చలియించెడి
దోసకారి నొదున ! నీ
కోసమె కద నా మనుగడ !

తీరని నా తృష్ణ తీర్ప
ఆరని నా చిచ్చు నార్ప
ఈరేడు జగాల సౌఖ్య
భారములో ! ఏలో ?

www.vaaradhionline.com

## 77

నీ రుద్రనేత్రములే తెరచి, ప్రభూ !
పారజూడుము నా బ్రతుకులో నలుమూలలల !

రేగు పెంధూళి నాలో! చెల
రేగు పెంజీకటి లోలో!

దారుణ నైదాఘ తరణి మండలములౌ
నీ రుద్రనేత్రములే తెరచి

నిశితాతి నిశితాసి నిష్ఠురములౌ
నీ రుద్రనేత్రములే తెరచి

నశియింప జేయుము వీని
నవ నవజీవ మిత్తువు కాని
ప్రళయ భీషణ మూర్తి ! ప్రణయ శీతల వర్తి !
నీ రుద్రనేత్రములే తెరచి !

www.vaaradhionline.com

## 78

నా కన్న తల్లి వమ్మా!
నీ కన్న
నా కింక ఎవరు కల రమ్మా !

ఓప జాలని క్షుధా తాపమ్ము చల్లార
ఏ పయస్సుల నింపెదో పేద బ్రతుకార !

జరుగ దమ్మా బ్రతుకు ! సాగ దమ్మా పిలుపు !
బరు వాయె నమ్మ నా పనికిమాలిన జోలె !

అడుగు పడ దమ్మ ! నా ఎడద నడిరే యమ్మ !
అడరి అడరీ నేల పడుదునేమో తల్లి!

అల సలసి పెనుధూళి కనుమూతునో జాలి !
చల్ల చల్లని కేల మెల్ల మెయి నిము రమ్మ !

# 79

అవని అంతా పెద్ద అక్షయపాత్ర !
అఖిలేశు హస్తమే అన్నపూర్ణమ్మ !

ఆరిపోవనిది నా ఆకలే అయితే
అంతు దొరకనిది ఆ అమృతాబ్ధి కాదా !

అన్నమో, అమృతమో - అకొన్న పేద కో
కన్నతల్లీ ! బ్రతుకు నిండ భిక్షాం దేహి !

గుడిసెలో, గుడులలో కునుకు బిచ్చగాడు
వాడ వాడల తిరుగు వాడే ఇచ్చువాడు !

పిలువ వచ్చిన వేళ తలుపు తీయని నాకు
అంతరాంతరములో అవతరింతువా ఏమొ !

అమ్మవో, అతిథివో - అకొన్న పేద కో
కన్నతల్లీ! బ్రతుకు నిండ భిక్షాం దేహి !

ఆ వాడ ఈ వాడ, ఆ ఇంట ఈ ఇంట
అఖిలేశు హృదయమే అన్నపూర్ణమ్మ !

ప్రతి నవ్వు పలికించు పండు పున్నమి అయిన
ప్రతి గుండె పులకించు పాల్కడలి కాలేద !

కరుణకో, వలపుకో - అకొన్న పేద కో
కన్నతల్లీ ! కన్నతల్లీ ! భిక్షాం దేహి !

# 80

నా విన్నప మ్మిదే నా బ్రతుకు బ్రతుకంత
నరకాగ్ని నుసి చేయవా ?
నా తండ్రి!
నవ జీవనము పోయవా!

ఏ అంతమే లేని దే లోపమే లేని
దేదొ ఆనంద మీవా !
నా తండ్రి !
ఏదొ ఆ శాంతి తేవా !

నడిరేయి చీకట్ల కడుపులోనే ప్రొద్దు
పొడుపు బంగరు మెరయదా !
నా తండ్రి !
చెడని తేజము విరియదా !

ఆకొన్న హాలాహ లాగ్నికీలల వెనుక
అమృత భాండమ్ము లేదా!
నా తండ్రి !
అభయ హస్తమ్ము రాదా !

ఆహారముగ శోక, మశ్రు పానీయమ్ము
అనవరత మందీయవా!
నా తండ్రి!
పనిబూని దయ సేయవా!

శిరము తెగచీల్చు కంటక కిరీటపు కొనల
ఏ వరము గ్రుచ్చినావో !
నా తండ్రి!
ఏ మనుచు మెచ్చినావో !

వెలుగు లిచ్చెడు నీవు సిలుగు లిచ్చితి వంచు
విసిగి నిను వేధింతునా !
నా తండ్రి !
విసమేని నిరసింతునా !

నీ కోర్కె ఏ దైన నీ యిచ్ఛ ఏ దైన
నెప మెన్ను దోషిగాను!
నా తండ్రి !
తపియింతు నీకై నేను !

# 81

జాగ్రత! జాగ్రత! మాయ జగ త్తని
శాస్త్రము లెల్లను విప్పెదవు
భాగ్యము ప్రేమము పయఃకణము లని
బైరాగి ధర్మము చెప్పెదవు

ఇది అంధకూప మిది అస్థికార
బ్రతు కంత పాడు పా డందువు
పది దిక్కు లంటు మధుమల్లి వనము
తుదిలేని వల్లకా డందువు

లోకాల నేలు ఏకైక రాజు
క్రూరాత్మ డంచు శంకింతువు
ఏకాకి ఏడ్పులే ఎన్న డంచు
ఇట్టట్టు శిరసు పంకింతువు

ఎలమావి కొమ్మ శిఖరాల గుండె
కో కొ మ్మటంచు కోయిలలు
అల సానిలాన తల లూపి పైన
లత నూగు పూవు టూయెలలు



www.vaaradhionline.com

ఈ హాయిలోన ఈ తోటలోన
ఎవ్వారి కిట్టి బోధనలు
ఓహొూ విరాగి! ఓహొూ విరాగి!
ఉడిగింపు శుష్కసాధనలు

ఎవ్వారు విందు రోహొూ విరాగి!
ఎపు డైన పిచ్చి తత్వమ్ము
ఇవ్వేళ శార దేందు స్మితమ్ము
ఏ ర్లయ్యె లోన సాగరము

ఎవ్వారు నమ్మ రోహొూ విరాగి!
ఈలాటి ఘోరవాక్యమ్ము
ఏదోయి చోటు హాలాహలమున
కక్షయ్య మమృత భాండమ్ము

తాటాకు ముసలిదస్త్రాలు విప్పు
వేదాంత ఘోష లిక వినము
సా టేది లేని సంసారము స్వర్గము
జగ మంత పెద్ద బృందావనము

లో టేది నాకు లోకాల స్వామి
  లో లోన కట్టె మందిరము
సా టేది లేని సంసారము స్వర్గము
  జగ మంత శాంత బృందావనము

ప్రతి ఇంట నిల్చి, ప్రతి గుండె పిల్చి
  పలికింతు వీణ సందేశము
సా టేది లేని సంసారము స్వర్గము
  జగ మంత మధుర బృందావనము

సంసారి, రమ్మ ! సంతాపి, రమ్మ !
  సద్రమాట్టు, రమ్మ ! సన్యాసి, రమ్మ !
సా టేది లేని సంసారము స్వర్గము
  భువనమ్మ గొప్ప బృందావనము

(దువ్వూరి రామిరెడ్డిగారి పాట చదివి)

www.freegurukul.com

# 82

శిధి లాలయమ్ములో శివుడు లేడోయి
ప్రాంగణమ్మున గంట పలుక లేదోయి
దివ్య శంఖము గొంతు తెరవ లేదోయి
పూజారి గుడినుండి పోవ లేడోయి

చిత్ర చిత్రపు పూలు చైత్ర మాసపు పూలు
ఊరూర నింటింట ఊరకే పూచాయి
శిధి లాలయమ్ములో శిల కెదురుగా కునుకు
పూజారి కొరక టేని పూవు లేదోయి

వాడ వాడల వాడె! జాడ లన్నిట వాడె!
ఇంటి ముంగిట వాడె! ఇంటింటిలో వాడె!
శిధి లాలయమ్ములో శిలను సందిట బట్టి
పూజారి వానికై పొంచి ఉన్నా డోయి

# 83

ఎంత తుడిచినా ఎగసి పడడమే
సుంత తరుగదే ఈ ధూళి !
అంతరాంతరము నందు రేగునే
శాంతి నీయదే పెనుగాలి !

అరయ నొచ్చునా విడియ వచ్చునా
అంధకూపమే ఈ ఇల్లు !
అడరి అడరి ఎదు రరసి అరసి ఎటు
అలసి పోయెనో నా కళ్ళు !

వాడవాడలా జాడజాడలా
ఆడిపాడునే నా స్వామి !
పాడు టిల్లనీ వేడు దాసినీ
వీడి మసలునే నా స్వామి !

www.vaarsgaonline.com

(వెనుకటి గీతికే పారాంతరము)

ఎంత తుడిచినా ఎగిరి పడడమే
నుంత వదలదే ఈ ధూళి!
అంతరముల ఈ ఇంట రేగునే
శాంతి నీయదే పెనుగాలి॥

తరిమి తరిమినా తరగని దుమ్ము
దులిపి దులిపినా తొలగని బూజు
మూల మూలలా ముసిరే చీకటి
మూలుగులు – అయ్యయ్యో॥

ఎగసి వెలుగదు, సొగసి కునుకదు
ఏటికి ఈ నట్టింటి దీపము?
ఇంత స్నేహమును పోసేవారూ
ఎగసన దోసే వారూ లేక॥

పాడుపడిన ఇల్లని - నా స్వామి
వాకిట నిలిచి మరలునో
అడుగిడి లోనికి వచ్చునో
అరసి నలుగడల నొచ్చునో॥

త్రెగదెంచం డయ్యా, ఏ
ద్వేషపు సంకెళ్లని!
తెగనివి కా వయ్యా యుగ
యుగముల వైనా కానీ!

ఏ కౌటిల్యము వీని
ఏర్పరచిందో కాని
చీకటిగదు లున్నే జగ
దీశ్వ రాలయము లోనే

గుణములేని వాని దే
కుల మైతే నేమి!
తృణ మైతే నేమి, శ్రీ
చరణ మంటు నేని!

మాలల మేమో పనికి
మాలిన వారమొ ఏమో!
శ్రీ లలితేశ్వర గళ నవ
మాలా కుసుమాల మేమొ!

# 85

జయ జయ లోకేశ ! జయ జయ ప్రాణేశ !
జయ జయ శీతల కరు ణామృతధర !
జయ జయ యాచక చాతక జీవిత
దాహ సంహార ! తాప సంహార ! మంగళం ॥

నీల నీరద రథనేమి నిస్వనము వి
శాల గగన వీధి తేల రావోయి !
గంభీర గర్జా విజయ శంఖ ధ్వానముల్
హరిదం తాక్రాంతమై మొరయ రావోయి ! మంగళం ॥

తరళ సౌదామనీ కరదీపికా కాంతి
భువన భువనముల మెరయ రావోయి !
హరి విచిత్ర మయూరీ పింఛాళి వి
హార వీధుల నాట్యమాడ రావోయి ! మంగళం ॥

వాహినీ భంగ సందోహ మాగధ గీతా
కైవారముల తోడ కదలి రావోయి !
సకల చరాచర సామంత పరివార
పరివేష్టితుండవై తరలి రావోయి ! మంగళం ॥

చిర విరహానల పరితప్త మీ ముగ్ధ
సరసీ హృదయము పొరల రావోయి !
సంత తామృత రా గానంత గంభీర ప్ర
శాంత వారిధార ముంప రావోయి ! మంగళం ॥

# 86

మనసులోన కారుమబ్బొ మలిన మలిన తిమిరమ్మొ
మరి మరి మరి ముసురుకొన్న మనసారా పాడు మోయి
బ్రహ్మ కృపాహి కేవల మని !
బ్రహ్మ కృపాహి కేవల మని !
బ్రహ్మ కృపాహి కేవల మని !
బ్రహ్మ కృపాహి కేవల మని !

హృదయ మందు కారుబిచ్చొ ఎగయు కాలకూట విషమొ
పొదివి పొదివి దహియించిన హృదయమార పాడు మోయి
బ్రహ్మ కృపాహి కేవల మని ॥

బ్రదుకు బ్రదు కెడారి అట్లు భయంకర శ్మశాన మట్లు
ప్రిదిలి శిధిల మైన వేళ బ్రదుకారా పాడు మోయి
బహ్మ కృపాహి కేవల మని ॥

నీలో నవ నందనమ్మొ నవ విభాత గగనమ్మొ
పాలసంద్రమో వెలసిన పవలు రేయి పాడు మోయి
బహ్మ కృపాహి కేవల మని ॥

www.vaaradhionline.com

(వెనుకటి గీతపు ఇతివృత్తము పైనే మరల వ్రాసినది)

నీ కృపయే నీ కృపయే అని
మనసారా అనరాదా

మదిలో మబ్బో చీకటియో
పొదివే వేళల అనరాదా
నీ కృప ఒకటే నీ కృపయే
నీ కృపయే, ప్రభు, నీ కృపయే
నీ కృపయే సుమ - నీ కృపయే అని
మనసారా అనరాదా

సిలు గైనా నెల వెలు గైనా
విస మైనా మధు రస మైనా
నడిచే దారి ఒంటరియై
కడచే సీమ ఎడారియై
అడుగే పడనపు డనరాదా
అడుగే పడనపు డనరాదా ॥

నీలో సుమ మంజరి విడితే
లోలో వెన్నెల జడి పడితే
కే లెత్తి మరి అనరాదా
కే లెత్తి మరి అనరాదా
ఎదలో పులుగో నెల వెలుగో
ఎగిరే వేళల అనరాదా ॥

# మధు మురళి

www.vaaradhionline.com

రేడియో ద్వారా, గాయకుల కంఠాల ద్వారా ప్రజల రసనల కెక్కిన మధురభక్తి గీతాలు – 'మధు మురళి', 'చైతన్య లీల', 'యమునా విహారి', 'శ్రీ ఆండాళ్లు', 'కృష్ణాష్టమి' వంటి శ్రవ్య నాటికల నుంచి కొన్ని, ఇతరములు కొన్ని ఇందులో చేరాయి

# 87

మురళీ ! మధు మురళీ !
మురళీ ! మృదు మురళీ !

కడిమి తరువుల నడిమి తెరువుల
నడచి వచ్చే దెవరు మురళీ !
దుడుకు వలపుల కడరి తన ఇలు
విడిచి వచ్చే దెవరు మురళీ !

మధుర మురళీ - మృదుల మురళీ !
అధర సీధువు లాను మురళీ !
అంటి అంటని అంగుళుల కొన
లందుకొని ఎలుగెత్తు మురళీ !

సందెలను కాళింది అందెల
సందడించే దెవరు మురళీ !
మంద మందపు టూరుపుల ఎద
అందగించే దెవరు మురళీ !

మధుర మురళీ — మృదుల మురళీ !
అధర సీధువు లాను మురళీ !
నెమలి పింఛపు నీడ నోరగ
నిలిచి నిక్కుచు పిలుచు మురళీ !

ఆల పొదువుల పాల కడవల
    అమృత ముంచే దెవరు మురళీ !
నీలి నీలి పిసాళి కన్నుల
    నీరు నించే దెవరు మురళీ !

మధుర మురళీ ! మృదుల మురళీ!
అధర సీధువు లాను మురళీ !
క్షుధిత హృదయ వ్యధల దీరిచి
సుధల కూర్చే దెవరు మురళీ !

—'చైతన్య లీల'

('మధుర మురళీ ! మృదుల మురళీ !' అనే చరణాలు
శాస్త్రిగారు తరవాత చేర్చుకున్నవి)

www.vasantamayuri.com

# 88

ఓ హెూ హెూ! ఓ హెూ హెూ! ఓ హెూ హెూ! ఓ హెూ హెూ!
ఎవ రయ్యా పిలిచేరు ? ఇటు గుండెలు కలచేరు ?
ఓ హెూ హెూ !

బృందలోన మంద లోల మారుతములు తరలు!
మందానిలములను యమున అందెరవళి పొరలు!
ఓ హెూ హెూ !

పొల తరువు తలపై నెల పైన మాపి వినును !
మాలతి శేఫాలి కొమ్మ పైకి ప్రాకి కనును!
ఓ హెూ హెూ !

పల్లెలో పెరళ్ళలోని అలు చిందులాడు !
గొల్లల లోగిళ్ళ లోగి గుండె లుండ నోడు !
ఓ హెూ హెూ !

– 'యమునా విహారి'

www.vaaradhionline.com

## 89

క్రార్తిక రాత్రుళ్లూ - ఊఁ
    కరిమ బ్బుంటుందా? – ఆ!
కాలమేఘ మాకాశము వదలి
    నేల నడుస్తుందో? - ఓ!

నడిచే మబ్బునకూ - ఊఁ
    నవ్వే పెద వుందా? - ఆ!
పెదవు లందితే పేద వెదుళ్లే
    అదరి పాడతాయో? - ఓ!

తెల్లని వెన్నెల్లో - నల్లని మబ్బుల్లూ!
నీలపు మబ్బుల్లూ – నేల నడుస్తాయీ!
నడిచే మబ్బులకూ నవ్వే పెదవుల్లూ!
నవ్వే పెదవులకూ మువ్వల వేణువులూ!

- 'యమునా విహారి'

# 90

వెల్లు పూల పానుపు పైనా
జల్లు జల్లులుగా - ఎవరో
చల్లినా రమ్మా! వెన్నెల చల్లినా రమ్మా !

కరిగే పాల కడవల పైన
నురుగు నురుగులుగా –
మరగే రాధా మనసూ పైన
తరకా తరకలుగా — ఎవరో
పరచీనా రమ్మా ! వెన్నెల పరచీనా రమ్మా !

కడిమి తోపుల నడిమి బారుల
ఇసుక బైళుల మిసిమి దారుల
రాసీ రాసులుగ — ఎవరో
పోసీనా రమ్మా — వెన్నెల పోసీనా రమ్మా !

- 'యమునా విహారి'

## 91

ఊరకే చలియించు
    నీ రేయి వెన్నెలలు
విరహ వీణా తరళ
    తరళ తంత్రీ గతుల!
ఏ దిగం తాహ్వాన
    వేదనా రవ మేని
కలచు తొందరలతో
    పలుకరించునో కాని!

వలిసెజ్జపై మల్లి
    యల రెప్పలే వాల,
వలయు నా బ్రతుకు
    శయ్యా శాంతిలో తేల
దలప శర దానిల
    మ్ములు శర్వరీ విరహ
సురభి నిశ్వాసములు
    సొగయించు దిశ దిశలు!

# 92

తెల్ల తెలవారె వ్రేపల్లెలో విన రమ్మ
చల్ల తరిచే సవ్వడి !

నల్ల నగు నా స్వామి నడయాడు వాడలో
వల్ల మాలిన నిదుర వలదమ్మ ! చెలులార !

అల్లన బయళ్లలో ఆలమందలు మూగె,
పల్లెలో ప్రతిబాట పరవశమ్మున నూగె !

కొమ్మ కొమ్మా పిల్లగ్రోవి నాట్య మ్మాడె !
కొమ్మలారా ! పులుగు గోవింద అని పాడె !
తెల్ల తెలవారె

– 'శ్రీ ఆండాళ్లు'

www.vaarthalonline.com

## 93

ఈ దారి నా స్వామి నడచేనా ?
పాదాల జాడ లివి విడిచేనా ?

ఎవరైన నా విభుని చూచేరా ? - స్వామి
ఏమైన నా మాట అన్నారా ?

ఎన్నాళ్ల కెన్నాళ్ల కన్నారా ? - మీరు
కన్నార నా స్వామి కన్నారా ?

కరి మేను చిన్నెల్లు విరిసేనా ? - స్వామి
చిరునవ్వు వెన్నెల్లు కురిసేనా ?

శిఖపైని శిఖిపింఛ మూగేనా ? - స్వామి
ఒకసారి నవవేణు వూదేనా ?

మన సంత కోరికలు మూగేనా ? - మీ
మని కంత ఊయాల లూగేనా ?

బృందావనీ సీమ ఇదియేనా ? - కా
ళిందీ నదీ తీర మిదియేనా ?

రాధా మనో వీధి విడిచేనా ? - స్వామి
ఈ దారి నా కొరకు నడిచేనా ?
ఏ వైన నా మాట లడిగేనా ?

- 'చైతన్య లీల'

www.vedaonline.com

# 94

రాధ విరహబాధ అనురాగ మధుర గాథ -

జాలిమాలి వనమాలి చనియె నొక్కనాడు
బేలమనసు రాధ నొకతె ఏలా విడిచినాడు !

దరియలేని విరహ రాగ తప్త అయిన రాధ
ఇరులు మూగు మునిమాపున ఇల్లు వెడలె బాధ

దౌలదౌల మురళి చల్లగాలి తేలి మ్రోగె ;
తాళలేక రాధ మనసు తల్లడిల్లి ఊగె !

నిబిడ తరుణ నీప వనీచ్ఛాయ రాధ నిలిచె ;
కృష్ణ కృష్ణ కృష్ణా అని కేరి కేరి పిలిచె !

- 'చైతన్య లీల'

# 95

వృసురుకొను మునిమాపు
ముసు గోసరిల నింక,
మిసిమి నెల మీగడల
పస లలముకొను నింక !

పరచుకొను నెల మల్లె
తెర లొత్తిగిల నింక -
కరి మొయిలు మెయి హొయలు
కరుణించు నను నింక !

అలముకొను నీలి సో
యగపు పెదవుల నింక,
లలిత మధు హాస సువి
లాసము లలరు నింక !

విరిసికొను చిరునవ్వు
వెలు గొరసికొని ఇంక,
మరచు నా వేదనా
తమ మిగురుకొను నింక !

www.vaavadhionline.com

## 96

వేయబోవని తలుపు తీయమంటూ పిలుపు !
రాధ కెందుకో నవ్వు గొలుపు—
నీలోన నాలోన నిదురపోయే వలపు
మేలుకుంటే లేదు తలుపు !

విశ్వమంతా ప్రాణవిభుని మందిర మైన
వీధివాకిలి ఏది చెల్లెలా !
విశ్వవిభుడే రాధ వెంటనంటీ రాగ
పిలు పేది తలు పేది చెల్లెలా !

– 'కృష్ణాష్టమి'

www.vaaradhionline.com

# 97

వ్రేరు జన్మ మెత్తెదను మాధవుడనై నేను
చిరునగవుతో చెదరు కురులతో మురళితో
తరుణ నిబిడ తమాల తరు వినీల వనాల
ఇరుల నడకల తోడ విరుల చూపుల తోడ॥

వ్రేపల్లె వాడలో వేగు గోపిక తాను
ప్రిదులు నెదతో అదరు పెదవితో బెదరుతో
తరణి తనయా తీర సిత సికత మార్గాల
తడయు నడకల తోడ తడియు చూపుల తోడ!

www.vaaradhionline.com

# 98

మ్రోయింపకోయ్ మురళి,
మ్రోయింపకోయ్ కృష్ణ !
తీయ తేనియ బరువు
మోయలే దీ బ్రతుకు ! మ్రోయింపకోయ్

మురళి పాటకు రగిలి
మరుగు నీ వెన్నెలలు !
సొగయు నా ఎద కేల
తగని సౌఖ్యజ్వాల ? మ్రోయింపకోయ్

కాలు చల్లదనాలో !
కనలు తీయదనాలో !
వలపు పిల్లన గ్రోవి
పిలుపులో ! సొలపులో !

వలదోయి ! అలము నీ
కలలలో నిదురింతు—
భరమోయి ! నీ ప్రేమ
వరమే నేటి రేయి - మ్రోయింపకోయ్

# 99

ఒక్కసారి వింటే నీ పేరే
ఊగి పోయేనె నా మనసు !
ఉండలేదురా మనసు !
పక్క పక్కనే ఉంటేనా,
పరవశమై పోనా ? నీ
పదముల పడిపోనా ? మోహనా ! ఒక్కసారి-

నల్లమబ్బు మై చాయ అని
ఫుల్ల కమల నయనమ్ము లని
మల్లెపువ్వ నవ్వు పెదవు లని, మా
పల్లెకు దయచేసే వని !
కళ్ళలో వత్తు లిడుకొని, కని
కనీ కరగి పోనా? రాధనై కరగిపోనా ? ఒక్కసారి-

ఘనులు కాంచని నీ సొగసు
కనికరించి, నా కెదు రయిన
మునుల కందని ఆ వెలుగు, నీ
కనులకు పున్నమి నెల అయిన
నిలువునా పూల పులకలై,
వలపులై నిలిచిపోనా ?

# 100

నిన్న రాతిరి నాకు నిదుర రాలేదే !
కన్ను లూరక తెరచి కాచి ఉన్నానే,
ఇన్నాళ్ళు తన కోస మెదు రరయు నాకై
సన్నసన్నగ తానె స్వామి వేంచేయు నని, నిన్న-

వడి వడిగ పొలిమేర బడి సారె సారెకును
అడుగు లేవో మ్రోసెనే !

దవు దవుల పువుదోట కవల కోవెల లోన
సవడి ఏదో తోచెనే,
ఆ మురళి
రవళి లాగే పిలిచెనే -
నిన్న రాతిరి నాకు నిదుర రాలేదే !

–'శ్రీ ఆండాళ్లు'



www.saradhionline.com

# 101

ఏ విసువు లేదు నా హృదయేశ్వరునకు, నా
కే వేద నైన తన వేణూత్సవ మ్మేన ?

అలయదా, రేయి వెన్నెలల మల్లెల ఎడద ?
ఎడలేని అమృతాల జడులేల ఆ వేల – కే విసువు..

ఎగయునా యమునహృదయమున నల లే వైన ?
సొగయించు వాసనలె సెగలైన ఆ దీన – కే విసువు..

భరియించుకో గలద నిరుపేదరాలి ఎద
పులకించు సుకములే పొరలగా విరియగా –
ఏ విసువు ..

## 102

మరువకే ఈ దాసి
　　మాట ఈ నడిరేయి
పరువు పరువున వస్తివా?
　　　　　　　　నా కృష్ణ,
వరము లేవో తెస్తివా?

విసువకే నా తోడ
మసలి విడియుదువా నా
ఉసురు ఉన్నంతవరకు,
　　　　　　　　నా కృష్ణ,
విసము చల్లారు వరకు!

పగలు రేయీ బ్రతుకు
బ్రతుకంత నా కనుల
బడి చెదరి చలియించెను,
　　　　　　　　నా కృష్ణ,
బెడి సగము నశియించెను—

ఎగసి ఎగసిన ఎడద
పగిలిపో కిన్నాళ్ళు
ఎటులు నీకై నిలిచెనో,
　　　　　　　　నా కృష్ణ,
ఎటులు నీకై పిలిచెనో!



www.vaaradhionline.com

# 103

ఎడబాసి పోకోయి
　　　　ఈ దాసి నీ రేయి
ఈ ఎదకు నిముసమే
　　　　నెడబాటు విసమే!

చెదరు నా బ్రతుకులో
　　　　కదలు స్వప్నాలలో
నీ సొగసు నీలాల
　　　　నిలుపలే దే వేళ

పరచు నీ పద మాగ
　　　　బ్రతు కంటికొని పోగ
విడని సంకెలగ నా
　　　　ఎడద బంధింపనా?

నీ చరణ ధూళిలో
　　　　నిదురించు బ్రతుకులో
ఏ తావు లెగయునో
　　　　ఏ తేనె లొలయునో!

www.vaarahionline.com

# గుడి గంటలు

హరి, రాముడు, శివుడు మొదలైన అర్చామూర్తుల సంకీర్తనలు 'గుడి గంటలు'. చాలావరకు 'శ్రీ ఆండాళ్లు', 'ధనుర్దాసు', 'కృష్ణాష్టమి', 'దక్షయజ్ఞం', 'శివక్షేత్ర యాత్ర', 'మాళవి కాగ్నిమిత్రం', 'అరుణరథం' వంటి శ్రవ్య నాటికల నుంచి గ్రహించినవే, ఇతరత్రా ప్రచారం పొందినవీ కొన్ని ఉన్నాయి – 'రామచరణం' పాట వంటివి.



www.vaaradhionline.com

గణ గణ గణ గణ గుడి గంట !
గుడి తలుపులు విడె నేమోనే !
బిర బిర రావే నా వెంట !
హరి పిలుపులె అవి ఏమోనే !

గణ గణ గణ గణ జయగంట !
మెయి మెయి పులకలు ఇవియేనే !
వనజ నయనుడే కొలువుంటే
కనుగొన మనసున త్వరలౌనే —

గణ గణ గణ గణ జయగంట !
వినిపించెను ఈ వరకే లే !
హరి నా పతి నోముల పంట
అరుదెంచెను నా కొరకే లే !

- 'శ్రీ అండాళ్లు'

## 105

నవ తులసీ దళ దామా!
  నవ కువల యాభిరామా !
నవ నవ లావణ్య సీమ !
తిరువరంగ ధామా ! శ్యామా !

సురల కేని మునులకేని
దొరక రాని పదము లాని
విరుల తోడ చేరిచి - నా
శిరసు నుంచనీవా? దేవా !          నవ

కోరి కోరి రమ్మనిన
తీరా నీ వేతెంచిన
ధార లైన అశ్రుల నీ
రూపు తోచ దేమి? స్వామీ !          నవ

- 'శ్రీ ఆండాళ్లు'

# 106

పూవు లేరి తేవే చెలి
పోవలె కోవెలకు
నీ వలె సుకుమారములు
నీ వలెనే సుందరములు        పూవు లేరి

తుమ్మెద కా లూననివీ
దుమ్ము ధూళి అంటనివీ
కమ్మగ వలచేవి, రక ర
కమ్ముల వన్నెలవీ        పూవు లేరి ....

ఆలసించినా, పూజా
వేళ మించిపోయినా
ఆలయమ్ము మూసి, పిలు
పాలింపడు నా విభుడు        పూవు లేరి .

మాల లల్లు టెపుడే? నవ
మంజరు లల్లే దెపుడే? ఇక
పూలే పోయాలి తల
బ్రాలల్లే స్వామి పైన!        పూవు లేరి .

## 107

అడుగుల కడ పడి ఉండనీ
అశ్రులు కన్నుల నిండనీ
అశ్రులతో నీ దివ్య రూపం
అదే పనిగ చూస్తుండనీ! అడుగుల.

ఇదీ అదీ ఇమ్మని అడగను
పెదవి కదపనే కదపను
హృదయం నిండా ఆ లావణ్యం
పదిలముగా నే దాచుకొందును అడుగుల

నాలోనే హరి హరి హరి హరీ అని
నామ జపమాల!
శ్రీలోలా! మరి మరి మరి మరి
పూజా మంగళ వేళ! అడుగుల ...

www.vedamrutham.online.com

## 108

నమో నమస్తే! శ్రీ నారాయణ!
దయా పరాయణ! నమో నమో!
నమో నమస్తే! నవ వసంత యువ
జీవన కారణ! నమో నమో!

నమో నమస్తే! తిమిర పాశ వి
క్లేశ విమోచన! నమో నమో!
నమో నమస్తే! దినకర హిమకర
దివ్య విలోచన! నమో నమో!

నమో నమస్తే! శత శత తారా
మణిగణ హారా! నమో నమో!
నమో నమస్తే! స్మేరానన రుచి
రాశా సారా! నమో నమో!

జరా మరణ సంహారా! నమస్తే!
పరాత్పరా! శ్రీకరా! నమస్తే!
సుందర సుందర! నమో నమో! ముని
మానస మందిర! నమో నమో!
నమో నమో! మన్మనోహరా!
నమో నమో! సంతాప హరా!

## 109

శ్రీ చరణ సన్నిధిని చేరి నిలవండీ!
శ్రీ చరణ సన్నిధిని శిరసు లుంచండీ!
శ్రీ చరణ సన్నిధియె పెన్నిధి అనీ, దయా
వార్నిధి అనీ - బ్రతుకు
సారధి అనీ - నేడు శ్రీ చరణ....

మునుగిడ్డ కురుమావు ముదుక దుప్పటి తూల,
ముసలి సీతువు పారగా – ఆ వెంట
పస చెడ్డ పారుటాకుల పంచె దిగజార
శిశిరకాలము పరవగా - వెన్వెంట
పసి చెడ్డ ఆ అంధకార వీధుల నడచి
క్రూర బాధల గడచి,
దుఃఖగాధల మరచి శ్రీ చరణ....

నెత్తిపయి జాళువా పాత్రలో, కోరికల
నెత్తుకొని మంగళ విభాతమ్ము తోచె!
మెత్తనాసల తావి మొత్తముల దిగద్రావి
మత్తిలిన నవ పవన పోతమ్ము వీచె!
చిత్తముల 'జీవన విధాతా!' అనీ, 'జగ
త్త్రాతా!' అనీ, హృదయ
నేతా అనీ – నేడు శ్రీ చరణ....

అత్త మిల్లిన కనుల అల్లు కొన్నవి చూడు
క్రొత్త చూపుల తీగలు!
సత్తు వెడలిన మేన సందడించుచు పాడు
క్రొత్త నెత్తురు వాగులు!
ఇత్తరిని హరిని మన సందు హత్తీ, నిండు
గొంతు లొత్తీ, రెండు
చేతు లెత్తీ - నేడు     శ్రీచరణ....

www.vaaradhionline.com

జయా జయా జయ ! జయా జయా జయ !
రమాప్రియా జయ ! శుభాశయా జయ !
జయా జయా జయ ! నిరామ యామృత
సదాశయా జయ ! జయా జయా జయ !

సురాసు రానత శిర స్ఫుర త్సుమ
గళ న్మరంద స్నపిత పద యుగళ !

చరాచ రాత్మక జగ న్నికాయా !
దయామయా జయ ! జయా జయా జయ !

మునీశ యోగి జనతా దృగంచిత
మణీ ఘృణీ రంజిత పద యుగళా !

దినేశ తారా శశాంక హారా !
పణీశ శయ్యా ! జయా జయా జయ !

– 'ధనుర్దాసు'

www.vaaradhionline.com

## 111

జో జో జో జో
సరసిజ నయనా, హరి శ్రీసదనా
జో జో జో జో

ఒడి ఉయాల పవళింపు మయా - పా
ల్కడలి లహరిపై తూగు మయా !
జిలిబిలి చేతలు చిరునవ్వు పూతలు
మాని హాయి నిదురింపు మయా! జో జో జో జో....

ఎటుల నిన్ను లాలింతు నయా - ఈ
సకల జగము పాలింతు వయా!
నను మరపించిన నను మురిపించిన
నల్లనయ్య! నిదురింపు మయా! జో జో జో జో

- 'శ్రీ ఆండాళ్లు' లో పవళింపు సేవ

www.vedabhavonline.com

## 112

ఏ కేల ఈ డోల
ఈ లీల నిను బాల
నే నూపుదునా
బాల కృష్ణా!

రాకా శశాంక వద
నా! కుంద రదనా!
వ్రజాంగనా హృదయ
సదనా! కృష్ణా!

www.vaaradhionline.com

## 113

జో జో చిన్ని కృష్ణ ! జో ముద్దు కృష్ణా !
జో కృష్ణ జో కృష్ణ ! జో బాల కృష్ణా !

వెన్నెల్లు పరచిన విన్ను పానుపు మీద
కన్ను విప్పక తాను పన్నుండె కరి మబ్బు !
చల్ల గాలులు తెచ్చి, చామరమ్ములు తెచ్చి
ఊయాల నచ్చరల్ ఊపేరె వాని! జో జో...

నురుగుల్లు పరచిన తరగపై, కలువపై
ఒరిగి గాటపు నిదుర మరిగెనే చిరుతేటి !
విసరు ఊర్పులు తెచ్చి, వింజామరలు తెచ్చి
ఊగించిరే వాని నాగ కన్యలు వచ్చి ! జో జో...

- 'కృష్ణాష్టమి'

## 114

జయ జయ కృష్ణా ! జయ జయ కృష్ణా !
జయ జయ జయ జయ జయ గోవిందా!
జయ జయ గోప కిశోర ! యశోదా
నందా ! నంద కుమార ! మనోహర !

జయ జయ శ్రావణ జల దేందీవర
తరుణ తమాల కిసాల సమాన
శ్యామల కోమల చారు శరీరా !
మామక హృదయాంతర సంచారా !
జయ జయ కృష్ణా !

జయ జయ నవ నవ సుందర సుమదుర
దరహసి తోన్మిషి తానన మోహన
రజనీకర ! మధుకర మృదు చికురా !
రాధా మానస ధన పాటచ్చర !
జయ జయ కృష్ణా !

జయ జయ కదంబ కకుభ ప్రసూన
కేసర కేసర నవ కువలయ దళ
సురభిళ మృదు శయ్యాప్త విహారా !
గోపీ జనతా ఘన తాపహరా !
జయ జయ కృష్ణా !

– 'కృష్ణాష్టమి'

## 115

రామచరణం రామచరణం !
రామచరణం మాకు శరణం !
మాకు చాలును మౌని మస్తక
భూషణం శ్రీరామచరణం - రామచరణం...

రాగమై ఈ బ్రతుకు చెడి రా
యైన వేళల రామచరణం
మూగయై, పెనుధూళి పడి మ్రో
డైన వేళల రామ చరణం !

ప్రాణ మీయగ రామచరణం
పటిమ నీయగ రామచరణం !
మాకు చాలును జరయు, మృతి రా
నీక ప్రోచే రామచరణం ! రామచరణం...

కోతియై ఈ మనసు నిలకడ
కోలుపోతే రామచరణం !
సేతువై భవజలధి తారణ
హేతు వైతే రామచరణం !

ఏడుగడ శ్రీరామచరణం
తోడుపడ శ్రీరామచరణం!
మాకు చాలును ముక్తి సౌధ
ప్రాంగణం శ్రీరామచరణం! రామచరణం....

నావలో తానుండి మము న
ట్టేట నడిపే రామచరణం!
త్రోవలో, కారడవిలో తో
డ్తోన నడిచే రామచరణం!

నావ యైతే రామచరణం
త్రోవ యైతే రామచరణం
మాకు చాలు వికుంఠ మందిర
తోరణం శ్రీరామచరణం! రామచరణం....

దారువునకును రాజ్య ధూర్వహ
దర్ప మిచ్చే రామచరణం!
భీరువునకును అరి నెదిర్చే
వీర మిచ్చే రామచరణం!

అభయ మిచ్చే రామచరణం!
ప్రభుత నిచ్చే రామచరణం!
మాకు చాలు మహేంద్ర వైభవ
కారణం శ్రీ రామచరణం!       రామచరణం . .

ఎదురు చూచే పేదకై తా
నెదురు వచ్చే రామచరణం!
ముదిసి వాడిన బ్రతుకు కొన్కల
మురిసి మెచ్చే రామచరణం!

ఆదరించే రామచరణం!
సేద దీర్చే రామచరణం!
మాకు చాలును రామచరణం
నుండి రాలిన మధుకణం!       రామచరణం. . .

www.......online.com

# 116

నీ పదములె చాలు రామా !
నీ పద ధూళులె పదివేలు !
నీ పద మంటిన పాదుకలు - మ
మ్మాదు కొని ఈ జగ మేలు !

కోవెల లోనికి రాలేను – నీ
కోరిన కానుక తేలేను – నిను
కానక నిముషం మనలేను - నువు
కనపడితే నిను కనలేను !

నీ దయ గౌతమి గంగ – రామయ !
నీ దాసులు మునుగంగ
నా బ్రతు కొక నావ – దానిని
నడిపే తండ్రివి నీవ !

# 117

శ్రీ కంఠుడు మా తండ్రి స
తీ కళత్రు డేడీ? కై
లా సాచల సా నూపల
సోపానము లిరు కెలకుల
వాస మున్న ప్రమథులార!
ప్రమథులార! ప్రమథులార!

నా సామి పదాల నెడద
మోసి మనవి దెల్పి కొందు
నందీశ్వర భృంగీశ్వర
వందారు సుపర్వులార!

రోషమ్మున మోసమ్మున
ద్వేష మషీ విషమున లో
కావలి కావలి కలిగె శ్రీ
తావను డున్నాడా? కై
లా సాచల సా - - - ప్రమథులార!

www.vaddadionline.com

## 118

సాంబశివ శివ, సాంబశివ శివ !
నవ నిశాకర కుసుమ శేఖర !

దివిజ గాంగ ఝరీ ధరా ! భవ !
అభవ ! దక్షసుతా ధవా ! హర !
హర హరా హర ! హర హరా హర !

కటక కంకణ కింకిణీ ఘన
రణన శింజిత యోగి జన గణ !

రాజ తాచల శిఖర భవనా !
భువన భువ నావన ! అకారణ !
సాంబశివ, సాంబశివ, శివ శివ !

– 'దక్ష యజ్ఞం'

www.vaartha online.com

## 119

శివ శివ శివ అనరాదా?
శివ నామము చేదా?

శివ పాదము మీదా – నీ
శిరసు నుంచ రాదా?
భవ సాగర మీదా - దు
ర్భర వేదన ఏదా? శివ శివ శివ

కరుణాళుడు కాదా – ప్రభు
చరణ ధూళి పడరాదా?
హర హర హర అంటే - మన
కరువు తీరి పోదా? శివ శివ శివ

కరి, పురుగూ, పాము, బోయ
మొర లిడగా వినలేదా?
కైలాసము దిగివచ్చి
కైవల్యము ఇడలేదా? శివ శివ శివ.

మద నాంతకు మీదా – నీ
మన సెన్నడు పోదా?
మమకారపు తెర స్వామిని
మనసారా కననీదా? శివ శివ శివ

- 'శివక్షేత్ర యాత్ర'

## 120

ఎందు కయా సాంబశివా!
    ఎవరు నీకు చెప్పా రయా?
ఈ అల్లరి చేతలు –
ఈ బూడిద పూతలు!

అలల తోటి గంగ బట్టి
తలపాగా చుట్టి –
నెలవంకను మల్లెపూవు
కలికి తురాయిగ పెట్టి          ఎందు .

తోలు కట్టి పటకాగా,
కాలాహిని కుట్టి
కేల త్రిశూలం పట్టి
ఫాలమందు కీల పెట్టి          ఎందు. ..

రుద్రుడవో - కారుణ్య స
ముద్రుడవో హర హర హర!
ఎందు కయా ఈ దాసుని
కంద వయా దయామయా!          ఎందు. ..

- 'శివక్షేత్ర యాత్ర'

## 121

హర హర హర! హర హర హర!
శంకర! భక్త వశంకర!
దరహసి తానన సుందర!
రజత శిలోచ్చయ మందిర!

హర హర! సుర గంగాధర!
హర! హాలాహల కంధర!
జటారూఢ చంద్రాంకుర!
నిటాలాగ్ని నిష్ఠుర హర!

మోహన లోకావన భవ
కానన పటు దావ దహన!
భ్రమరాంబా చిత్తభవన
పావన పావన! హర హర!

– 'శివక్షేత్ర యాత్ర'

www.vaaraahionline.com

## 122

కైలాస గిరినుండి కాశికై—
  కాశికా పురినుండి దాసికై—
దాసికై, ఈ దక్ష వాటికై—
దయ జేసినా వయా! హరహరా! హరహరా!

విరిసి జాబిలి మల్లి రేకగా—
కురిసి తేనియల మువ్వాకగా—
దరిసి నీదయ నిండు గోదావరీ నదీ
ఝరు లాయెరా హరా! హరహరా! హరహరా!

ముక్కోటి దేవతల నేతరా—
ముల్లోకముల కిష్ట దాతరా—
వెలిబూది పూతరా — నలవిసము మేతరా—
హరహరా! హరహరా! హరహరా!

ఓహెూ! రథీకృత క్ష్మామండలా!
ఆహా! సరీసృప శ్రీ కుండలా!
నీహార గిరి నందినీ హారి హృదయ ధన
పాటచ్చరా! హరా! హరహరా! హరహరా!

- 'శివక్షేత్ర యాత్ర'

## 123

నటేశ్వరున కివె నమస్సులు, కర
పుటాల నిటలమ్ముల కీలించి – నటే ..

జటావాటి మినువాక నెలరేక
ఘటించేటి భువన మోహనునకును నటే. ..

సామేన కొలువౌ చాన నగ
జాదేవి నాట్య మొనరుప దివ
సావసాన సమయాన కడు పరవ
శాన జగ మలర తాండవము నెరపు – నటే .

శౌరి మృదంగము మ్రోయింప,
భారతి విపంచి వాయింప,
వారిజాసనుడు తాళ మిడగ, పా
కారి వేణువును పూరింప,
క్షీరవారాశి కన్య పాడ సు
రాళి పొగడ తాండవమ్ము నెరపే– నటే..

– 'మాళవి కాగ్నిమిత్రం'లో శివస్తుతి

# 124

నమో నమస్తే నారాయణ నవ
జీవ నిధానా ! నమో ! నమో !
అంధకార వారణ దారణ చణ
కిరణ కృపాణా ! నమో ! నమో !

గ్రహ తారా నీహార మయూ ఖా
ఖండ మండలేశ్వరా ! నమస్తే !
ఇహ పర లో కాంతరాళ నిశ్రే
ణీ కృత బహుళకరా ! నమస్తే !

కమల వనప్రియ ! విమల విష్ణుపద
వీదీ పథికా ! నమో నమస్తే !
కుటిల పాశ విక్లేశ విమోచన !
లోక లోచనా ! నమో నమస్తే !

సప్త తురంగమ ! తప్త కాంచన !
చ్ఛాయా ! ఛాయా వరా ! నమస్తే !
సుప్త జంగమ స్థావర నూతన
చైతన్య వరాధార ! నమస్తే !

కిరణ కశా త్రస్తాంధ నిశా !
తరుణ జీవనోచ్చలిత రసా !
ఓ తమోఘ్న ! ఓహో హిమఘ్న ! ఓ
హోహో కృతఘ్నఘ్నా ! నమస్తే !

— 'అరుణరథం'లో సూర్యస్తవం

# ఋతు ఖేల

ప్రకృతి విలాసాన్నీ, ఋతు విభ్రమాన్నీ మానవ జీవితంతో సమన్వయించి కీర్తించే గీతాలు 'ఋతు ఖేల'. చాలా వరకు 'రాజ ఘట్టం', 'ఏడాది పొడుగునా', 'శర్మిష్ఠ', 'మాళవికాగ్ని మిత్రం', 'విద్యాపతి' వంటి శ్రవ్య నాటికల నుంచి గ్రహించి నవి; వివిధ సందర్భాలలో విడిగా వ్రాసినవీ కొన్ని ఉన్నాయి

www.vaaradhionline.com

ఎవరు నాటిరో, ఎవరు పెంచిరో
వివిధ సుందర తరువుల
మివుల చల్లని దయా ధారల
తవిలి కురిపించి - వానికి
వందనమ్ము ! చరాచరాత్మక
జగత్కర్తకు, విశ్వభర్తకు
వందనమ్ము ! వందనమ్ము !

ప్రతి గిరియు నొక మౌనియై, ఎ
వ్వనిని ధ్యానించు –
ప్రతి ఝరియు నొక భక్తురాలై
ఎవ్వనిని కీర్తించు –
ప్రతి కుజము నవ పల్లవమ్ముల
ప్రతి లతయు ప్రసవమ్ముల
సతత మెవ్వని చరణముల నిడి
సలుపు పూజల – వానికి వందనమ్ము. . .

(వన మహోత్సవ సందర్భంగా వ్రాసినది 13-1-62)

# 126

క్రడచిన దీ రేయి
నడచె నెటో పోయి
పొడిచె నదే శుక్రతార
పూర్వ గగన నిటలాన

విడిచె నిదుర నవ మల్లీ వల్లీ విచలిత పల్లవ పాళి
అడరి రెక్కలను విదలిచి విదలిచి తొడరి కూసె విహగాళి

వెలుగు ఉష స్పర్శనమున అల్లన నిట్టూరిచె పృదివి
చెలగె విశ్వమున కణకణమ్మున నవ చైతన్యము పొదివి

వన పథమ్మున పవన రథమ్మున స్వారిచేసె పరిమళము
కనులు నులిమికొని లేచి గల గల గళము విప్పె
నిర్ఝరము

– 'రాజ ఘట్టం'

# 127

ఆర్పుము ఆర్పుము దీపములు
రజనీదీపములు
అంధకారమున వెలిగించిన వవి
రజనీదీపములు

ఎరుగవా వీటి కెపుడు వచ్చెనో
అరుణ కిరణముల ప్రభాతము
కొరమాలిన వా మట్టి ప్రమిదలు
తెరువుము తెరువుము ద్వారములు -
ఆర్పుము

చేర్చు మొక్క మధుర శ్రుతిగా, నీ
ఛిన్న వల్లకీ తంత్రులను
నీరవమ్ముగా వచ్చి నిలుము నీ
నిల యాంగణముననుు - ఆర్పుము

నీకై పాడును నేటి ఉదయమున
నింగి నెల్లెడల నిండి
సకల సమీరణ వీచికలు,
సమస్త కాంతి పుంజములు - ఆర్పుము .

www.vaaradhionline.com

## 128

ఉదయగిరి పైన
  అదిగో గగనాన
కదలె దినరాజు తేరు

పొదిగి చిరుగాలి
నిదుర తెర జారి,
కదలె కోనేరు నీరు ఉదయ

త్వరపడి వికసించె కమలము
తిరువడి కడ నిడె దళ దళము !
వివరించె విహంగమ కులము
సవరించి గళము మంగళము

హరి ఓ మ్మనె కోవెల గంట
హరి ఓ మ్మనె దెసదెస లంట
  హరి ఓమ్ ! హరి ఓమ్ !
హరి ఓ మ్మనె గిరులూ ఝరులూ,
పరవశమున పులుగులు తరులు !

పలు కాడని, కదలని రాయి
చలియించెను పూవై, పులుగై
నవ మోహన గాన మధురమై
నవ జీవన పరిమళ భరమై

www.vaanaprasthaonline.com

## 129

తెరవండీ తలుపులు! వీధి తలుపులు!
పురాణ మీ దివాణం చెడిబూజు పట్టకుండ!
వినరమ్మా పిలుపులు! మేలు కొలుపులు!
ప్రశాంత మీ ప్రభాతం పరుగెత్తి పోవకుండ!

బూజు దుమ్ము ధూళి, మూసెను తిమిరాళి!
మాసె ఈ హవేలీ!-

ఊర్చెను సరికొత్త కొత్త వార్త లెవో గాలి!
తీర్చెను ద్వారముల స్వర్ణతోరణముల హేళి!
బిరాన తెరవరేం!
పురాణ మీ దివాణం చెడి బూజు పట్టకుండ!-

అది గదిగో తల లూపుచు ఎదుట మావి చిగుళ్లు!
ఎర్ర కోర్కె చిగుళ్లు! -
ఊరక పులకించె నిదే ఒగరు వేప ఒళ్లు!
రగులు వలపు జల్లు!-
మరలి రావు మన ఇంటికి సీతుకారు దిగుళ్లు!
చీకటి రాత్రుళ్లు! -

గుమ్మము ముంగిట కో యని కోయిల ఆర్చె!
కోయిల కన్నా మున్నే గున్నమావి ఊర్చె!
మావి కన్న మున్నే మలయమారుతమ్ము వీచె!
మలయానిలు కన్న మున్నె మల్లెపొదలు లేచె!

— 'ఏడాది పొడుగునా'

# 130

సాకీ: ఇది మధు మాసమ్ము, ఇది వానకారు,
ఇది వెన్నెలల వేళ, ఇది సీతుకారు –
ఆ మహానంద ఖేలన మందు ప్రభవించి
మరలి ఇవి తోచునని మానవుం డూహించి
మొదట తా నే నాడు మది నెరిగెనో కాని
ఏటి మొగ ఇది యంచు ఎపు డెరిగెనో కాని !

ప్రథమ వత్సరాది ఎపుడొ? ఎపుడొ ? ఎపుడొ ?
ప్రథమ చైత్ర రథం పైని
ప్రథమ వత్సరాదిని కని
వచ్చిన అతిధికి మానవు
డిచ్చేనా స్వాగతం?

మధు రాశా మసృణ కిసల
మాలిక లల్లేనా ?
మహిత మనోరథ మంగళ
రంగవల్లు లుంచేనా?

దోహలమున ఊహల సుమ
తోరణములు కూర్చేనా ?
వచ్చిన అతిధికి మానవు
డిచ్చేనా స్వాగతం?

## 131

"ఎవరు వారు వచ్చేరు? పువుల తేరుపై!"
"క్రొత్తకారు! క్రొత్తకారు!"
"చైత్రరథం లోన, శ్యామ పత్ర పథం పైన
ఎవ రా వచ్చేది?"

"అది ఉగాది! అది ఉగాది!"

"కుసుమలతా పతాక!
కోయిల బాకా!
వహవ్వా! ఎన్నాళ్లకు రాక!"

"మరకతముల కుళ్లాయి!
మావి చిగురు తురాయి!
అరదానికి పూన్చిన మల
యానిలం హుమాయి!"

"ఏం బడాయి! ఏం బడాయి!"

"తూరుపు దెస బంగరు తలు పోరగ తెరిచి,
బారులుగా నరనారులు హారతు లెత్తి,
రమ్మనండి లోనికి – ప్రియమ్ముగలు పలికి!"

('శర్మిష్ఠ' నాటికలోని పాఠాన్ని శాస్త్రిగారు మరొక విధంగా మార్చి ఉగాది సందర్భంలో వాడుకున్నది.)

# 132

ఎవ్వ రని ! ఎవ రమ్మ వారు ?
  ఎదురు వచ్చే దెవ్వరు ?
ఇ వ్వనిని తొలి జవ్వనపు ఎల
  నవ్వు తెచ్చే దెవ్వరు ?     ఎవ్వ రని

నిద్రపోయే పొదల తములపు
  ముద్ర లుంచే దెవ్వరు ?
నిద్రపోయే కొమ్మ పెదవుల
  ముద్దు లుంచే దెవ్వరు ?
సద్దుమణిగే గూటిలో
  సన్నాయి వినిచే దెవ్వరో ?
సద్దుమణిగే గూట వలపుల
  సుద్దు వినిచే దెవ్వరో ?     ఎవ్వ రని . . .

సరి గంచుతో సరికొత్త తీగల
  జారు పయ్యెద లెవరికో !
మరకతపు చెవ్వా కెవరికో !
  అరతొడిమె జూకా ఎవరికో !
వలి మంచులో తొరిపించనా ?
  తెలి తేనె మనసున నించనా ?
చివురాకు తెర తెరపించనా ?
  నులివెచ్చ ప్రణయా లెవరికో !
  అరవిచ్చు కోరిక లెవరికో !   ఎవ్వ రని ...

## 133

అదియే సుమా ఉగాది - మన
కదియే బ్రతుకు పునాది - రా
గల బ్రతుకున కదియె పునాది - రా
గల సుఖాని కదియె పునాది

అదియే

పగిలేటి పాన పాత్రికలో
మిగిలేటి కాస్త మధు వుంటే
మసిలాగ మూసి నిసి ఉన్నా
నొసలందు వేగుచు క్కుంటే

అదియే

విడిచింది శిశిర వేళ అనీ
కడచింది మరువ కలిగుంటే
పెను మోడు చివురు పెడుతుం దనీ
మునుముందె తొగరు కనుగొంటే

అదియే

www.vaaradhionline.com

ఒక్కనాడు - ఈ ఒక్కనాడు
ఊరక రా దిది గనుక — ఇది ఉగాది గనుక
చెక్కిట కన్నీటి చాలు తుడిచెయ్ - నలు
పక్కల నీ బరువు లన్ని విడిచెయ్
ఒక్కనాడు..

ఒక్క నాడె — ఈ ఒక్క నేడె
ఎక్కడి కని ఈ గోడు — వదిలెయ్ వెనక
ఊరే కోర్కెల పైన ఊరేగ వోయ్ —మితి
మీరే ఆశల పైన సవారి చెయ్
ఒక్కనాడు..

బుస కొడుతూ వేసంగి
కసిరి కొడుతు చలికాలం
ఉంటే నేం పొలిమేరల
ఉదుటున దాటెయ్
మరుమజిలీ వరకు, ఒక్క
ఉరకనె దాటెయ్
ఒక్కనాడు..

www.vaaradhionline.com

## 135

కైసేసి కొన్నదే ఒయారి వోలె – వనలక్ష్మి
ప్రియుడి రాక కోసము బలె

కై సేసి. . .

అరుణాధరముల లత్తుక వోలె,
అలరులతో కింశుకము [1]
వరలు చెక్కిళుల మకరికతో, పలు
వన్నెలతో కురవకము [2]

కై సేసి. . .

బోటి నొసటిపై, బొట్టువలె – ఎల
దేటులు మూగిన తిలకము [3]
పాటల కపోల పాళిక
సాటి తరుణ కంకేళిక [4]

కై సేసి. . .

- 'మాళవి కాగ్నిమిత్రం'

1. మోదుగు 2 ఎర్రగోరింట 3 బొట్టుగు 4 అశోకము

# 136

ఒక తుమ్మెద ఎదలో జుమ్మంది
ఒక మంగళ మంత్రం పలికింది
ఎందుకు ఒంటరి బ్రతుకు, పెళ్ళి
విందుకు నన్నూ రమ్మంది -
ఒక తుమ్మెద ..

గిరులు ఝరులు, తెమ్మెరలు వనతరులు
విరులు విహగ మృగ విసరములు
తరణి చంద్ర తారా గ్రహ గణములు
తరలి పోవు సందడి విను మన్నది -
ఒక తుమ్మెద ..

లోక కల్యాణ మందిరమున, సు
శ్లోక శుభవాద్య బృందమున
అనురాగ వీణ ఆనంద గాన
మాలపించ రమ్మన్నది, ఆ
హ్వాన మందు కొమ్మన్నది –
ఒక తుమ్మెద ..

www.vaaradhionline.com

# 137

వృధూదయంలో మంచి ముహూర్తం
మాధవీ లతకు పెళ్ళి!
మాధవి పెళ్ళికి మల్లీ మాలతి
మందారం పేరంటాళ్ళు !

కొమ్మ కొమ్మ కొక సన్నాయి
రెమ్మ రెమ్మ కొక గవాయి
కొమ్మా రెమ్మా కలిసి మామిడి
గుబు రంతా ఒకటే హాయి !

నందన మంతా పందిరి అయితే
మసృణ కిసాలయ మంటప మైతే
మాధవీ లతకు మాధవ దేవుడు
మంగళ సూత్రం కడతాడు

- 'విద్యావతి'

# 138

మల్లె నమ్మా, మల్లెనే! నా
ఒళ్ళు సందెల జల్లనే –
పెళ్ళికూతురు మగనికై, కొస
వేళ్ళ మాలిక లల్లెనే – మల్లెనమ్మా...

పసిడి రేకుల, పదును బాకుల,
మిసిమి తావుల మొగలినే!
మగువ సిగ నన్నల్లితే నే
మొగిలు పాయల మెరపునే ॥

చెలియరో! నే కలువను,
నల్ల కలువను - న
న్నలల నూపును తల్లి కొలను –
కలికి చెవి జూకాను లే, వె
న్నెలల దొర బాకాను లే ॥

చేరి కొలుచు సుమాలు నను, అ
రామమున దొరసానినే –
వీరులకు జయహార మను – మం
దారమను, నే రాణినే ॥

పచ్చనాకుల రాణి వాసపు
పడతినే, సంపంగినే!
సరసులను, సామంతులను నా
స్వాదు వాసన పిలుచునే॥

దారి పజ్జను గడ్డి సెజ్జను
దాగి ఉండే బీదను,
నిరుపేదను -
పూజ కంటే వస్తిని, ఏ
మోజు లేని చిన్నవిరిని –
ప్రభువు కొలువున దాసిని, శ్రీ
పదములకును తివాసిని ॥

పూలజాతర 17-10-1958

www.vaaradhionline.com

ఏ ఊహ వేసిన బొమ్మలో
ఏ చేయి పూసిన వన్నెలో
సంజలో మబ్బు పింజలో, అప
రంజి కుంకుమ చిన్నెలో

ఏ ఊహ. . .

ఆ కొండరాల దిగబారి
ఆ తోట గుబురులో జారి
వాగులో, ఊగు అలలలో, రేగు
నురుగులో అవే వెలుగులు
ఒక రేయి తుడుచు, ఆ వెలుగులు

ఏ ఊహ . . .

నాలో దాగే రూపులు
లోలో మూగే తలపులు
వేయనీ, ఎపుడు మారనీ, సుంత
మాయనీ చిత్ర పటములు, ఏ
రేయి తుడవని పటములు
నా చేయి వేసిన వన్నెలు, ఏ
రేయి తుడవని బొమ్మలు

ఏ ఊహ.

సందెలో మంద లో
లానిలమ్మ
చలువగా పిలువగా
తలల నూపు లతల పైని,
తలిరు టాకు దోనెలోని
అళి కుమారు వలపులోని
మెలపు తూగి తూగదా
ఊగదా ఊగదా

దూర దూరాలలో
తోయరాశి తీయగా
మ్రోయగా మ్రోయగా
పులకరించు యేటి పైని
జలదరించు అలల పైని
పలవరించి కలవరించి
పడవ తూగి తూగదా
ఊగదా ఊగదా

(హరీన్ గీతం విని)

# 141

శీతవేళ రానీయకు - రానీయకు -
శిశిరానికి చోటీయకు – చోటీయకు -
ఎద లోపల పూలకారు
ఏ నాటికి పోనీయకు - శీత ...

ఉగ్ర మైన వేసంగి గాడ్పులు
ఆగ్రహించి పై బడినా
అదరి పోవకు -
ఒక్కుమ్మడిగా వర్షా మేఘం
వెక్కి వెక్కి రోదించినా
లెక్క చేయకు – లెక్క చేయకు శీత ...

చైత్రంలో తొాగ రెక్కిన కొత్త కోర్కెలు
శరత్తులో కై పెక్కె తీయని కలలు
మనసారా తీర్చుకో – మనుగడ పండించుకో
లోకానికి పొలిమేరను - నీ లోకం నిలుపుకో
శీత ...

ఉదయాన కలత నిదర చెదరిపోవు వేళ
మబ్బులలో ప్రతి తారక మాయమయే వేళ
ముసలి తనపు టడుగుల సడి ముంగిట వినబడెనా
వీట లేడనీ చెప్పించు – వీలు కా దనీ పంపించు
శీత ...

# 142

పచ్చ పచ్చని తోట
పై బడె నంత
వేసంగి కోపాలు,
మూసి మేఘాలు
పోసిన జల్లులు,
పున్నమి వెల్లులు,
అడరించు చలికారు,
జడ శిశిరమ్ము –

చెదరి మానవుడు ని
ట్టూర్పుచు, కూర్చు
అంధ మందిర మందు
అశ్రు జపమాల !

www.vaaradhionline.com

# 143

ఏ నిదాఘ విదాహ మెందుకో !
అందుకో రాని పే రామని గతించెనా !
చంద నాచల పవన సరణి పయనించెనా !

ఒక ఇంత నిలవదే ఊరించునే గదే
వికచ పాటల శిశిరవాసన పదే పదే !

ఆరామ వాటి, హృదయాంత రాంతర పేటి
కారుకొన్నది ఏటి ఘోర దావానలము !

- 'విద్యాపతి'

www.vaaradhionline.com

# 144

రావే ప్రావృట్కాలమ! నీరద
 రథ నిస్వనములు మ్రోయగ తీయగ!
రావే ఓ రాజేశ్వర! విలులిత
వైద్యుత పతాక లూగగ, తూగగ!

ధవళ బలాకా తరళ వకుళ సుమ
హారీ! స్వేచ్ఛాంబర సంచారీ!
లలిత మయూరీ నారీ లాస్య
పులకిత కేళీ రంగ విహారీ!
రావే ప్రావృట్కాలమ!

- 'విద్యావతి'

www.vaarudhionline.com

# 145

ఆషాఢ యోషా మణీ కేశ పాశాన
    అల్లుకొన్నది తటిద్వల్లియో!
మొగిలి గుబురుల నీలిముసుగు లోపల వెలుగు
రగిలించునది మొగలి రేకో!

కడిమి పూ మొలనూలు దుడుకు గాలికి తూలు
అభిసారికకు త్రోవ కకుభ సుమముల కోవ!
పదము పదమున విరులె పొదువుగా పదిలముగ
వర్షా రమా ప్రణయ హర్ష మెటు దాచెనో!

– 'విద్యాపతి'

www.vaaradhionline.com

# 146

పడమటి వాకిటి తలుపులను
 గడియ తీసి తెరిచారా? .. ఆ!
దుడుకు గాలి గుర్రాలను
విడిచి బయట తోలారా? ఓ!

బయలుదేరె నదె మొయిలు తేరుపై
వానకారు దొరగారు!

ఆకాశపు రహదారులలో
అదిగో మొయిళ్ళ తేరు — ఆ
కారు మొయిలు పెను తేరు పయిన
అది గదిగో జడికారు
తిరిగే ఇరుసుల జోరు
మెరుపు పతాకల బారు
జారు బలాకల పేరు వేసికొని
వానకారు దొరగారు! పడమటి

తెరచి కిటికి ఒక యువతి
విరహ గీతి పాడె
మొగలి పొదలు తల లూచె
పొగడ, కడిమి పూచె
మొగిలు తేరు పైన వాన
కారు బయలుదేరె! పడమటి....

మురలి వచ్చెను వానకారు–రాజువలె! రాజువలె!
తరలి వచ్చెను వానకారు – మొరయు నదె!
వినగదే!
మొయిలు తేరు ఇరుసు హొరారు!

మెరుపు జెండా లూగగా – అర
దమును సమీర హయములు లాగగా
పురి విప్పి షడ్జమ స్వర మెత్తి తన విభుని
మ్రోల నటియింప తమి మీరి
ఒయ్యారి! అదే మయూరి!

దారి పొడుగున ఏరు పరచేరు
దట్టముగ దట్టముగ పొగడ పూలు,
కడిమి వాలు–
దారి కిటు నటు ఎవరు నిలిపేరు
బారులుగ ఇటు నటు నిలిపేరు
చేరువుగ చేరువుగ మొగలి పొదలు,
మొల్ల పొదలు–
హారముగ ఏరు కూర్చేరో
నీలి దారాలా? ఆ బలాకాలా?

# 148

నదీ సుందరి సుధా స్యందిని
  న గాదీశ్వర నందినీ!
నడచి కోన, నడుమ కాన
కడచి వచ్చిన నవరురీ!
నదీ సుందరి.

దరులు నీ పై ఒరిగినా, చిరు
రెమ్మతో ప్రతి కొమ్మతో
దరిసి దాగుడు మూతలా ? న
య్యాటలా ? మరి పాటలా ?
నదీ సుందరి....

అందెలా కడియాల గలగల
అందమా చిరునవ్వు తళతళ
మందముగ నిట, తొందరగ నట
మలుపు మలుపూ మధుర భంగిమ!
నదీ సుందరి

ఆకాశం పైన, ఆ కడలి లోన
ఆ వైపు ఈ వైపు వెన్నెల్ల వాన! వెన్నెల్ల వాన!
కురిసి కురిసి కుమ్మరించి వెన్నెల్ల వాన!
వెన్నెల్ల వాన!

ఎందు కింత ఆనందం? ఎవరికోస మీ హాయి?
ఎవరి దీ దయాజ్యోత్స్న ఈ ఒంటరి రేయి?

ఎగి రెగిరీ ఆ కెరటం - ఏల నాట్య మాడడం?
ఎగ సెగసీ ఆ నురుగులు - ఎందు కలా నవ్వడం?
ఎగి రెగిరీ, ఎగ సెగసీ, పొర్లి పొర్లి, దొర్లి దొర్లి -
ఎందు కింత ఆనందం..

కడ కడలూ ముంచెత్తే వెన్నెల్లు,
కడలి చదలు కలిపేసే వెన్నెల్లు,
కనుల ముందు కొలను లయి వెన్నెల్లు,
మనసులోన మడుగు లయి వెన్నెల్లు!
ఎందు కింత ఆనందం...

# 150

త్రెలి రెల్లు బయలులో
కొలకులో ?

తెలి కొలకు అలలలో
అంచలో ?

తెలి అంచ గరులలో
వెన్నెలో ?

తెలి వెన్నెలల లోన
చలువలో ?

పొగడ తెరువుల కెలన
వెదురులే !

వెదురు గుబురుల లోన
గాలులే !

గాలి ఊరుపులలో
వెన్నెలే !

తేలు వెన్నెలలలో
వలపులే !

– 'విద్యావతి'

www.vaakilionline.com

## 151

ఇంటి మొగసాల వేం
  చేసినా కంట గన లేరు!
హిమ కంఠ రావము వినరు!

చైత్రమాసము మల్లి
కా హాసము నశించె!
చిత్ర చిత్రేంద్ర చా
ప విలాసము గతించె!

శారద రమా శుభ్ర
సౌందర్యము కృశించె!
  ఇంటి మొగసాల

– 'విద్యావతి'

www.sarasabharathi-vuyyuru.com

# 152

ఏల ఇంత జాలి వీడు
　కోలు? నేడు నిలువ జాల!
ఆలసించి చేరనా నీ
హార దూర తీర వేల?

అలసి అలసి ఈ హసంతి
కానలమ్మ నిదురించునా!
మలసి మలసి చేమంతి సు
మాళి బాళి పలవించునా!

లోల మ్లాన లోధ్రసూన
మేఖల దిగజారి సోలు!
తూలి తూలి నా ద్విపటీ
తుహి నాంచలములు తేలు!

ఏసరేగు, ఎటుల మ్రోగు
ఈ ఈదరగాలి పిలుపు!
ఓసరిలెను కాబోలును
ఉత్తరపుం గవను తలుపు!

– 'శర్మిష్ఠ'

## 153

ప్రతి శిశిర కుసుమమ్ము,
ప్రతి శిథిల పత్రమ్ము
వెత అనో, సురిగిన
కత అనో అనుకోకు!

అవలి దరి మ్రోసేను,
అలరు టామని పిలుపు!
ప్రసవమో, పర్ణమో
మసలు నని అనుకోకు!

- 'విద్యాపతి'

www.vaaradhionline.com

# వి రి తూ పు

www.vaaradhionline.com

కొంతవరకు సాంప్రదాయిక ధోరణిలో సాగినట్టు కనిపించే శృంగారగేయాలు 'విరి తూపు' 'మదన సాయకం', 'గౌతమి', 'మాళవి కాగ్నిమిత్రం', 'శర్మిష్ఠ', 'మేఘ సందేశం', 'వేణు కుంజం', 'స్వేదబిందువు' వంటి శ్రవ్యవాటికలనుంచి ఎంచినవీ, గాయనీ గాయనులకు ప్రత్యేకంగా వ్రాసి ఇచ్చినవీ ఈ గేయాలు.

# 154

జోహారో జోహారో !
హరి నందనునకు జోహారో !

ఆమని సఖునకు జోహారో !
అలరు రతీసతి కౌగిలిలో
పులకించు సామికి జోహారో !
జోహారో ! జోహారో !

చెరకు విలుతునకు జోహారో !
చిలుక రౌతునకు జోహారో !
విరి తూపుల వలపులు రేపే
చిలిపి జోదుకే జోహారో !

- 'మదన సాయకం'



www.vaarthaonline.com

## 155

మ్రావి కొమ్మపై కోయిల!
మనస్సు నేడు ఊయెల!
ఊయెల!

మిటారి సిగ్గు పొంగి పొరలి
మ్రోగెను లోలో మువ్వల మురళి!
ఆగ దెందు కీ అందెల రవళి?
అందెల రవళి!

వలపే వలపే నిజం నిజ మని,
నీవు లేనిదే క్షణం యుగ మని,
రేపు రే పని జాగు తగ దని-
కూసె నామని కోయిల!
మనస్సు నేడు ఊయెల!

# 156

సుందరా! పురందరా! శచీ మానస మందిరా! ఏ
మందురా! మదిలోన వలపులు మరగి తొందర
లాయెరా!

అందె రవళులు విందువా! నా
అందచందాల్ కందువా? ఓ సుందరా...

మందపవనుడు తరలెరా
మందాకినీ నది తెరలెరా! మన
నందనోద్యానమ్ములో
మందార మధువులు ఉరలెరా! ఏ
మందురా, మదిలోన వలపులు మరిగి
తొందర లాయెరా! ఓ సుందరా .

ఓరచూపులు తరలు నెవ్వనికై?
దోరపెదవులు విరియు నెవ్వనికై?
జారు పయ్యెదలోని ఎదలో
ఊరు రాగము లెవనికై? ఓ సుందరా .

- 'గౌతమి'

# 157

ప్రేమవిందుగా, కనువిందుగా
నా ముందర నిలిచే వెవ్వరవో ?
సుందరీ, ఓ సుందరీ! నాకై దిగివచ్చిన అచ్చరవో?

తీగవో, వాగువో, ఇన్నాళ్ళు నాలో
దాగిన తీయని కోరికవో ?
కౌగిలిలో ప్రియగా ఒదిగేవో ?
కలగానే మరి మిగిలేవో ?

కరగించకుమా సోగ కనుచూపు !
అర విరిసిన ఆ చిరునవ్వు !
ఈ ఎద నీ సోయగం నిండనీ,
ఈ సుఖ మిలాగే ఉండనీ !

www.vaaradhionline.com

# 158

స్రిగలో అవి విరులో,
అగరు పొగలో, అత్తరులో ?
మగువ సిగ్గు దొంతరలో?
మసలే వలపు తొలకరులో? సిగలో

జరిగి ఇటు ఒరిగి,
పరవశాన ఇటులే కరిగి,
చిరు నవ్వుల అర విడిన
చివురాకు పెదవుల మరగి

మరలి రాలేవు నా చూపులు
మరీ మరీ ప్రియా ప్రియా!
మరలి రాలేవు నా చూపులు
మధువుకై మెదలు తుమ్మెదలు సిగలో

ఎదుట నా ఎదుట ఏవో
సోయగాల మాలికలు
మదిలోన, గదిలోన
మత్తిలిన క్రొత్త కోరికలు

నిలువనీవు నా తలపులు
మరీ మరీ ప్రియా ప్రియా !
నిలువనీవు నా తలపులు
నీ కనుల ఆ పిలుపులు సిగలో

## 159

ఏమోనే ఓ ప్రియా !
ఈ నా మనసు నిలువదే !
నిముస మేని నిలువదే
నీ కన్నులు చూడనేని !

అటు చూచును, ఇటు చూచును
ఆగి ఆగి అటె నిలుచును !
అటు ఊగును ఇటు ఊగును
అలయిక నా యెద తూగును !

లోల మధుకరాళు లౌను
నీలోత్పల మాల లౌను
నీ కన్నుల వెంట వెంట
నా కన్నులు డోల లౌను !

www.vaagdevionline.com

# 160

ఏమే చిలకా ! కోపమా? నీ
　మది నే మైనా తాపమా?

అలరుల గూడే నేయనా? చివు
రాకుల వీడే వేయనా?
నా కల నీ కల ఏకముగా మన
రెక్క రెక్క కలిపేయనా ?

మింటిపైన మనసాయెనా? నీ
ఇంటి కొరకు దిగులాయెనా ?
జంటగ మాయని మధువని నీ వా -
ల్గంటి చెంత వదిలేయనా ?

## 161

నేటి రేయి కన్నుదోయి
నిదుర పోవ దేలో?
మాటికీ మదిలో ఏదో
దిగు లేటికో! నాగు లేటికో!

ఓ చెలియా, నా చెలియా!
ఊరకే మన సూగెనే,
మ్రోల నిలిచి 'ప్రియా!' అని
పిలిచేవా నీ వని తోచెనే!

కారు చీకటిలో
దూరమై, మరి చేరువై
కలగి, కదలి, పదే పదే నీ
కాలి అందెలు మ్రోసెనే!

www.vaddhionline.com

# 162

చెలీ! నన్ను లేపకే
 కలలు కనే వేళ
కలలో నయినా వానిని
కనగల నేమోనే - చెలీ!

ఉలికి ఉలికి పడినా,
పలు కాడగ బోయినా –
కలికీ! కట్టెదుట తోచు
వలరాయనితో నేనే – చెలీ!

ఏలాగూ రాడు – బూట
కాలు వాని బాసలు!
ఏటికే వాని ఊసులు?
చీటికి మాటికి లేపకే– చెలీ! ....

www.vaardhionline.com

# 163

మరచే దగునా ? నీవిరి
    శరముల దయ వలన - ఆ లలన!

కటిపై దాపలి కర మానించి          మరచే...

కుడిచెయి గురివింద కొమ్మ వలె జార్చి
కాలి వ్రేలి కొస కదిపే విరిపై
వాలు చూపు నిలిపే సోయగము      మరచే...

చిరు నగవున అర విరిసిన వాతెర
తెరపిని పలువరుసల తెలిమొగ్గలు
మెరయ తోచు కేసర ముఖములతో
సరసిజాత మా తెరవ నెమ్మొగము    మరచే...

- 'మాళవి కాగ్నిమిత్రం'

www.vaaniamme.com

# 164

వాని మనసు తెలిసేనా, తెలిసేనా?
ఔననీ, కాదనీ ఏదీ తెలిసేనా ? తెలిసేనా ?

పాడుకొనని కోరిక లెగ్రబాక నీయనా?
మీదు కింద అరసి అతని మీది మమత వీడనా ?

వేదన మనసున దాచి వేగిపోవ గలనా ?
కాదని చెలితోడ బిడియ మేది తెలుప గలనా ?

- 'మాళవి కాగ్నిమిత్రం'

www.vaaradhionline.com

# 165

ఎంత బాధ వెలీ - అంతవరకూ మనసు నిలుపుట ?
అంతు లేని నిరాశ కన్న, అగాధమైన నిశీధి కన్న
బతుకు బతు కంతా కన్నుల ఎదురు తెన్నులు చూచి వేగుట
ఎంత బాధ వెలీ!

తనువు కన్నా మున్నె ఎదురుగ కనులు పరుగిడునే!
కనులకన్నా మున్నె నిలువక మనసు త్వరపడునే !

గాలిలో తలిరాకు వలె
లోల వీణా తంత్రి వలె
వేలయై ప్రియురాకకై ఊ –
యాల లూగే మనసు నిలుపుట
ఎంత బాధ వెలీ !

- 'శర్మిష్ఠ'

www.vasradhionline.com

# 166

చలిత చలిత మచ్చరణ కటక మం
జీర గళ స్రుత శింజితమ్ము విను
పిలిచి పిలిచినా, పలుకరించినా
చలియింపదు జడశిలయో – నీ ఎద ?

తరళ తరళ మలయానిల లోల త –
రంగ చలిత వసనాంచలములు విను !
ఉసురుసు రనినా, గుసగుస మనినా
ఊగి తూగ దే కొరడో - నీ ఎద ?

లులిత లులిత దరహసిత వినిర్గత
లలిత లలిత చంద్రాతపములు కను !
వెలిగి వెలిగినా, తళుక్కు మనినా
పులక రింప దే మొరడో - నీ ఎద ?

- 'శర్మిష్ఠ'

## 167

ఏ నాటికీ రాడు – ఏలాటి ప్రియుడే!
ఈ లాగు వేచి ఎన్నాళ్లు సైచేనే?

తానే కదా వలపు లోన రేపేనే!
ఉండుండి నా మనసు ఊయ లూపేనే!
సారె సారెకు లోన సందియా లాయె,
ఊరకే ఏవేవొ ఊహ లొచ్చేనే!

తాను వచ్చే దారి నా ప్రేమ జల్లి,
ద్వారాన చూపుల తోరణా లల్లి –
ఎన్నాళ్ళు నా కళ్ళు ఎదురు చూసేనే?
ఏలాగు ఈ విరహ బాధ మోసేనే?

www.teluguone.com

## 168

క్రడచే నటే సకియా! ఈ రాతిరి
కడు భారమైన ఎడబాటున ?
అయ్యయ్యో! కడచే నటే

ఈ మేఘవేళ ఏమో గదే, సకియా!
స్వామి దవ్వైన నిదుర రాదాయెనే!
అయ్యయ్యో! కడచే నటే. .

ఆ కడిమి వోలె ఎదురు చూచెనే, సకియా!
ఏకాకి నా బ్రతుకు వేదాయెనే!
అయ్యయ్యో! కడచే నటే

# 169

ఏ లా గీ వియోగాన వేగేనో నా ప్రియా!
ఏలా గీ మేఘమాన మేగేనో ప్రియా! ప్రియా!

గడియ గడియ ఒక శిలయై
కదలదు సుమ్మా ప్రియా!
ఎడదలోన నీ రూపము
చెదరదు సుమ్మా ప్రియా!
పడి రావా అంటే వీలు పడదుకదా నా ప్రియా!

ఎడదలోన నీ అడుగులు
నడచి నటుల తోచి,
ఒడ లంతా మన అశోక
తరువు వోలె పూచి
కడు వివశత నూగిపోదు
గాలి కౌగిళులను సకియా!

ఆలో నీ అందె రవళి
దవు దవ్వుల తరలి,
నాలోపల అలవికాని శూన్యమె మిగిలి
జాలిగా 'నా సకియా! రావా?' అని పిలుతు ప్రియా!

–'మేఘ సందేశం'

# 170

ఏ సీమల ఏమైతివో
  ఏకాకివో నా ప్రియా!
ఈ సఖి నను ఎడబాసి
ప్రవాసివై ప్రియా ప్రియా!

మరి మరి మరిగే వెన్నెల
తెరువుల బడి నీకై
పరుగెత్తును నా మనస్సు
పలవించుచు ప్రియా! ప్రియా!

కను మూయదు రేయి; ఉస్సు
రనుచు గాలి నిట్టూరుచు
మన వాకిట మందారము
మౌనముగా తల వాలుచు

మన మురిపెపు నెమలి నిదుర
మాని దెసల పరికించు
పనవి పనవి నీ కోసము
మన శారిక పలవించు!

- 'మేఘ సందేశం'

గాలులా నిశివేళలా ఈ
విరహ రాగా లెవ్వరో?
ఆలపించే దెవ్వరో?
మనసు కరిగే వాగులు!

గాలులా నిశివేళలా ఈ
విరహ రాగా లెవ్వరో?
ఆలకించే దెవ్వరో?
మనసు మరుగు వియోగులు!

తీయగా, జాలిగా ఆ
దివ్యకథ ఎవ్వరిదో?

రాలు కరిగించేది మోడున
పూలు మొలిపించేది సీతా
రామచంద్రుల ప్రణయ గాథ –
ఆలకించే దెవ్వరో?
మనసు మరుగు వియోగులు!

తన కొరకు శివ ధనువు విరిచెను
తన హృదయ మంతా హరించెను
అనుచు సీత -

## 170

ఏ సీమల ఏమైతివో
　ఏకాకివో నా ప్రియా !
ఈ సఖి నను ఎడబాసి
ప్రవాసివై ప్రియా ప్రియా!

మరి మరి మరిగే వెన్నెల
తెరువుల బడి నీకై
పరుగెత్తును నా మనస్సు
పలవించుచు ప్రియా ! ప్రియా !

కను మూయదు రేయి ; ఉస్సు
రనుచు గాలి నిట్టూరుచు
మన వాకిట మందారము
మౌనముగా తల వాలుచు

మన మురిపెపు నెమలి నిదుర
మాని దెసల పరికించు
పనవి పనవి నీ కోసము
మన శారిక పలవించు !

- 'మేఘ సందేశం'

# 172

ఏటి కవతల నీటి రేవు
ఏటి కివతల పాటి రేవు!

నీటి గాలుల పైని నిట్టూరుతురు గాని
మాటలాడరు సందె మసక గుసగుస వారి
దుడుకు మనసులు ఊపెనే!
పడుచుతనములు రేపెనే! ఏటి . .

ఏటి కవతల ముసలి తోట
తోట కివతల కునుకు బాట!
ఇరువు రెదురైనపుడు బరువు రెప్పలు దాటి
పరువు లిడు ఎలదేటి పరువు జంటలు రెండు
రెక్క రెక్కా దరిసెనే!
ఒక్క నిమునము ఒరిసెనే! ఏటి

ఏటి కవతల ముసలి రావి
రావి కివతల దిగుడు బావి!
ఇరుకు చీకటి తెరువు, ఇరువు రెదురై నిలువ
పెదవి విప్పదు తాను, పెదవి విప్పడు తాను

కదిసి గుండెలు కరగెనే
కడవ నీరే తొరగెనే
కరగి మనసులు పెనగెనే
దురుసు తనములు తొణకెనే! ఏటి ...

## 173

తోట పిలిచె తోపు పిలిచె
ఏటి తరగల పాట పిలిచె!

ఏటి మొగనో తోట కడనో
ఎదురు పడితే పడుచులు
బెదరి లోబడవా మనసులు?
తోట పిలిచె..

ఎదురుగా పడినప్పు డాగి
కదల జాలవు వాని కళ్ళు
కదలి యెదురై ఆమె కళ్ళు
బెదరి రెప్పల చాటు మళ్ళు
తోట పిలిచె..

కళ్ళు కళ్ళూ కలిసి నడుమను
నల్ల కలువల దండ అల్లు
అల్లి అల్లి మొగ్గ తొడిగి
ఝల్లు మని ఊగే నొడళ్ళు!
తోట పిలిచె..

- 'వేణు కుంజం'



www.vaarthaonline.com

## 174

ఊరికే నా మనసు ఊగేనా ? చూపు
లూరికే ఆ వైపు లాగేనా ?

పుట్ట కాడ ఎవరో ?
చెట్టు నీడ ఎవరో ? పాల
పిట్ట కోస మీాల ఏస్తూ పుంత
గట్టు దారి పాము
పుట్ట కాడ మావి
చెట్టు నీడ ఎవరో ? పుట్ట కాడ

అయ్యకూడు వండి పెట్టాలా !
పెయ్య మెళ్లో మువ్వ కట్టాలా !
పిల్లగ్రోవి పిలుపు వచ్చె - అది
చల్లగాలి మోసుకొచ్చె ! పుట్ట కాడ

పోటు పాటు చూసుకొని
ఏటి రేవు దాటాలా !
ముళ్లు రాళ్లు చూసుకొని
ముళ్లదారి నడవాలా !
పిల్లగ్రోవి కబురుచేస్తే - ఎలా ?
చల్లగాలి మోసుకొస్తే – ఎలా ? పుట్ట కాడ

- 'వేణు కుంజం'

# 175

ప్రెరటిలోని గన్నేర! పెదిమి విరిచి నవ్వేవు!
కోరడిలో గోరింట! కోపగించి చూసేవు!

తెలుసా నా గుట్టు?
నలుగురికీ చెప్పేస్తే నా మీదే ఒట్టు!
ఒట్టు సుమీ! ఒట్టు!

నా లోపల పచ్చ నాకుల గూడుంది – తెలుసా?
ఆ లోపల పంచవన్నెల చిలకుంది – తెలుసా?
పచ్చ నాకుల గూటిలోన పంచవన్నెల చిలక –
పంచవన్నెల చిలకపై నా ప్రాణమంతా తెలుసా?
తెలుసా నా గుట్టు?

ఏరు చూడని వేళలను బంగారు చిలకను పైకి తీస్తా!
చేరి చెవిలో ఊసు లేవో చెప్పుకుంటా తెలుసా?

గూటి నుంచి రామచిలకను దాట నివ్వను తెలుసా?
దాటిపోతే కూటి నొల్లను ప్రాణ మొల్లను తెలుసా?
తెలుసా నా గుట్టు?

- 'వేణు కుంజం'

## 176

తుమ్మెదా! తుమ్మెదా! తుమ్మెదా!
ఊరెళ్లి పోతావ? తుమ్మెదా!

దూరాలె పోతావ? తుమ్మెదా!
ఊరెళ్లి పోతావ? దూరాలె పోతావ?
తుమ్మెదా! తుమ్మెదా! తుమ్మెదా!

వన్నెల్ల చిలకనూ తుమ్మెదా!
వదిలేసి పోతావ? తుమ్మెదా!
వన్నెల్ల చిలకనూ వదిలేసి పోతావ? తుమ్మెదా!

మళ్లీ వచ్చేలోగ తుమ్మెదా!
వెళ్లీ వచ్చేలోగ తుమ్మెదా!
మళ్లీ వచ్చేలోగ వెళ్లీ వచ్చేలోగ తుమ్మెదా!
ఏమైపోతాదో తుమ్మెదా!
ఎళ్లొద్దు ఎళ్లొద్దు తుమ్మెదా!
ఏమైపోతాదో ఎళ్లొద్దు! ఎళ్లొద్దు! తుమ్మెదా!

చెట్టుగాలీ వీస్తె తుమ్మెదా! గూట
పిట్టేమౌతాదో తుమ్మెదా?
చిల కేమౌతాదో? మొల కేమౌతాదో?
ఎళ్లొద్దు ఎళ్లొద్దు ఎళ్లొద్దు!

- 'వేణు కుంజం'

## 177

ప్రియా! కాలానికి రెక్క లుండగూడదు సుమా!
అనురాగాలకు హద్దులు మాత్రం ఎందుకు?
కానీ సుడులూ, వడులూ లేని ఏరులా సాగాలి కాలం!
దానిపై హంసలా తూగాలి సంసారం!

అదే జాబిలి,
ఇదే నా చెలి –
బ్రతుకు పడవ సాగాలి!
తరుల గుబురులో తారి చేరి
తరంగాల చిరుగాలి!

కనులు కనులలో కరగాలి!
మనసు మనసుపై ఒరగాలి!
క్షణము క్షణ మలా సాగి, సాగి
ననల పడవ జరగాలి!

- 'స్వేద బిందువు'

www.vaaradhionline.com

# 178

జయ జయా! జయ జయ జయా!
జయ రతీ రమణీ ప్రియా !

జయ రమా హరి నందనా!
జయ సమీర స్యందనా!
జయ నితాం తాశాలతా నం
దన వనా! ప్రణ యావనా! జయ జయా

గంధవహ మద సింధురా!
కామ రాజ్య ధురంధరా!
బంధు జీవక పాటలీ మం
దార బంధుర మందిరా! జయ జయా

అరుణ పల్లవ కేతనా!
తరుణ హృదయ నికేతనా!
జయ రసాల శరాసనా! శుక
వాహనా! నవ మోహనా! జయ జయా

మధు సఖా! జయ జయ జయా!
మల్లికా విశిఖా జయా!
జయ వసంత వన ప్రియాళీ
వంది మాగధ గీతికా! జయ జయా

# ప్రథమ పాద సూచి

| | గీతం | పుట |
|---|---|---|
| ఎంత కాలము నాథా! దురంత చింత? | 27 | 34 |
| ఎంత కాలము వేచి యుందును | 67 | 82 |
| ఎంత తుడిచినా ఎగసి పడడమే | 83 | 103 |
| ఎంత దయయో తండ్రీ! ఈ పాపులపై | 29 | 36 |
| ఎంత బాధ చెలీ - | 165 | 200 |
| ఎందుకయా సాంబశివా! | 120 | 150 |
| ఎందుకొరకు - ఎవరి కెరుక? | 3 | 3 |
| ఎక్కడ నుండో ఈ పిలుపు! | 10 | 12 |
| ఎటుల నిలువగలను? కటకటా! | 26 | 33 |
| ఎటుల నే నీ లీల కీర్తింతు! | 45 | 57 |
| ఎట్టు లుండునో నా యెద | 32 | 39 |
| ఎడబాసి పోకోయి ఈ దాసి నీ రేయి | 103 | 128 |
| ఎదురుగ నిలబడుదు ప్రభూ! | 20 | 24 |
| ఎపుడు నీ పిలుపు వినబడదో | 12 | 14 |
| ఎపు డైనా ఒక క్షణ మైనా | 7 | 8 |
| ఎలాగైన రావా? | 17 | 20 |
| ఎవ రది? ఎందుకు తీరిచి కట్టారు | 1 | 1 |
| ఎవరు నాటిరో, ఎవరు పెంచిరో | 125 | 157 |
| ఎవరు వారు వచ్చేరు? పువుల తేరుపై! | 131 | 163 |
| ఎవ్వ రని! ఎవ రమ్మ వారు? | 132 | 164 |
| ఎవ్వరూ నన్ను వినరు | 4 | 5 |
| ఏ ఊహ వేసిన బొమ్మలో | 139 | 172 |
| ఏ చోట దాచితివో ఈ చైత్రజీవమ్ము | 55 | 68 |
| ఏటి కవతల నీటి రేవు | 172 | 208 |
| ఏ దారి కల దోయీ! | 68 | 83 |

| | గీతం | పుట |
|---|---|---|
| మరచే దగునా ? నీ విరి శరముల దయవలన | 163 | 198 |
| మరలి వచ్చెను వానకారు - రాజువలె ! | 147 | 180 |
| మరలి వెడలి పోకుమా ! | 14 | 17 |
| మరు జన్మ మెత్తెదను మాధవుడనై నేను | 97 | 122 |
| మరువకే ఈ దాసి మాట | 102 | 127 |
| మలిన బాష్ప మౌక్తికమ్ము | 30 | 37 |
| మల్లె నమ్మా, మల్లెనే ! | 138 | 170 |
| మావి కొమ్మపై కోయిల ! | 155 | 190 |
| ముందు తెలిసెనా, ప్రభు ! | 18 | 21 |
| మురళీ, మధు మురళీ ! | 87 | 111 |
| ముసురుకొను మునిమాపు | 95 | 120 |
| మ్రోయింపకోయ్ మురళి | 98 | 123 |
| రండు మన జీవితముల కోరుచున్నది | 44 | 54 |
| రండు రండు ప్రాణేశుడు | 35 | 43 |
| రాధ విరహ బాధ అనురాగ మధుర గాధ | 94 | 119 |
| రామచరణం, రామచరణం ! | 115 | 143 |
| రారే మీ రని అనురా గాలోకము తెరచి | 42 | 52 |
| రావే ప్రావృట్కాలమ ! | 144 | 177 |
| రెల్లు పూల పానుపుపైనా | 90 | 115 |
| లేదోయి నిదురలో లేదోయి సుగతి ! | 49 | 61 |
| వాడిన తీగెకె గడియ గడియ కొక | 65 | 80 |
| వాని మనసు తెలిసేనా, తెలిసేనా ? | 164 | 199 |
| విందుగా కనువిందుగా | 157 | 192 |
| వినవో ! ప్రాణేశ ప్రణ యోత్స వాహ్వానము | 48 | 60 |

